# అన్నమయ్య గీతోపదేశాలు

(25 అన్నమయ్య గీతాలలో భగవద్గీతా దర్శనం)



వ్యాఖ్యాత:

డా. తాడేపల్లి పతంజలి

సమర్పణ :

సుజనరంజని



గురుదేవ స్తుతి
శ్రీమత్త్వదీయ చరితామృత మన్నయార్య
పీత్వాపినైవ సుహితా మనుజాభవేయుః
త్వం వేంకటాచలపతే రివ భక్తిసారం
శ్రీ తాళ్ళపాక గురుదేవ నమో నమస్తే

**Annamayya Geetopadesalu**
*(Commentary for 25 Sankeerthanas with Bhagawadgeetha)*

**First Edition - 1000 Copies**
Annamacharya's 603rd Jayanthi Celebration
17th May, 2011



Price : Rs. 80/-
$ 10 (US Dollars)

**Sponsored & Supported by**

**Dr. K.I. Varaprasad Reddy**
Shantha - Vasantha Trust
Hyderabad

*Cover Page :*

**Sri Koochi**

*Type Setting & Printing :*

**Bharat Printers**
307, Vasavi Meadows,
Czech Colony, Sanathnagar,
Hyderabad - 500018.
Ph. : 040-23818226, Cell : 98498 08489

*Published by & for Copies :*

**Sujanaranjani**
SRT 922, Sanathnagar,
Hyderabad - 500 018.
Phone : 040-23705440
Mobile : 98493 02342
seetaramasarma@gmail.com

[redacted]

# అన్నమయ్య గీతోపదేశాలు


సంకలనం / *Concept and Compilation*

**మహీధర సీతారామ శర్మ / Mahidhara Seeta Rama Sarma**

e-mail : seetaramasarma@gmail.com

98493 02342

వ్యాఖ్యానం / *Commentary*

**డా॥ తాడేపల్లి పతంజలి / Dr. Tadepalli Patanjali**

e-mail : patanjali1576@gmail.com

9866691587

# కృతజ్ఞతలు

డా॥ సముద్రాల లక్ష్మణయ్య గారు

ప్రొ॥ యస్. లక్ష్మణమూర్తి గారు

డా॥ పప్పు వేణుగోపాలరావు గారు

'పద్మభూషణ్' డా॥ కె.ఐ. వరప్రసాద్ రెడ్డి గారు

శ్రీ ఎమ్బీ.ఎస్. ప్రసాద్ గారు

డా॥ తాడేపల్లి పతంజలి గారు

శ్రీ గడ్డమణుగు రామకృష్ణ గారు

శ్రీ జి.బి. శంకరరావు గారు

శ్రీ పుట్టా కోటేశ్వరరావు గారు మరియు శ్రీమతి శాంతకుమారి గారు

**- సుజనరంజని**

*శ్రీ శివాయ గురవే నమః*

# అన్నమయ్య గీతోపదేశాల నేపథ్యం

*కన్న తల్లిదండ్రులు తాడేపల్లి సుశీల, పార్వతీశ శాస్త్రిలకు, తల్లిదండ్రులయిన అత్తామామలు* పిల్లలమర్రి రాజరాజేశ్వరి, సత్య సాగర్‌లకు నమస్సులు.

అన్నమయ్య గీతం గురించి, భగవద్గీతని గురించి ఈ రోజు కొత్తగా పరిచయం చేయవలిసిన అవసరం లేదు.కాని అన్నమయ్యపాటలోఉన్న భగవద్గీత గురించితెలుసుకోవలిసిన అవసరం ఉంది.

గీతని భగవానుడు చెప్పిన తర్వాత – అర్థం కాని మనబోటివాళ్లకోసం రామానుజులు, శంకరులు మొదలైన వాళ్లుదానికి భాష్యంచెప్పారు. వివరించారు. ఆధునికయుగంలో రకరకాల భాషల్లో దానిని గురించి పండితులు, స్వామీజీలు, బాబాలు అనేకమంది గీతని తమ దృష్టి కోణంలో చెప్పారు. గీతా యజ్ఞాలు చేసారు, చేస్తున్నారు. ఒక్కొక్కరి చూపులో ఒక్కొక్క మెరుపు ఉంటుంది. 'ముఖే ముఖే సరస్వతీ' అన్నారు కదా పెద్దలు. వేదాలు, ఉపనిషత్తులు, శాస్త్రాలు చదివిన అన్నమయ్య – భగవద్గీతని ఎలా అర్థం చేసుకొన్నాడు? ఎలా దానిని తన పాటల్లో విడమర్చి చెప్పాడు? పదకవితా పితా మహుని వ్యాఖ్యానం ఎలా ఉంది? ఇలాంటి ప్రశ్నలకు సమాధానం – ఈ అన్నమయ్య గీతోపదేశాలు అనే పుస్తకం.

ఒక కవిలో ఇంకో కవి రాసిన దాన్ని వెతకటం వల్ల ప్రయోజనమేమిటి? వ్యాసుడు భగవద్గీతలో చెప్పినదాన్ని అన్నమయ్య ఇలా చెప్పాడు అని విడమర్చి చెప్పటంలో కొత్తగా వచ్చే లాభమేముంది? ఒకటే లాభం... ఒకటే ప్రయోజనం. అదే ఆనందం. బ్రహ్మానంద సహోదరమైన ఆనందం.

ఈ ప్రపంచాన్ని 'దుఃఖాలయం' అన్నది భగవద్గీత. ఈ దుఃఖంనుంచి నిజమైన ఆత్మ జ్ఞానం వైపు ప్రయత్నించే సిద్ధుల కోసం (జ్ఞాన విజ్ఞాన యోగం.3శ్లో.) అన్నమయ్య భగవద్గీతని తన గీతాలలో చెప్పాడు. ఇంత మాత్రమేనా!? ఇంకా ఉందా!? ఇంకా చాలా ఉంది. బతికున్నప్పుడు కూడ వ్యక్తిత్వ వికాసంతో నిజమైన బతుకు ఎలా బతకాలో నేర్పే భగవద్గీతా సారాన్ని అన్నమయ్య తన కీర్తనలలో వివరించాడు.

గీత ముక్కు మూసుకొని తపస్సు చేసుకొనే వాళ్లకు మాత్రమే కాదు. కళ్లు మూత పడేలోగా కళ్లు నెత్తికెక్కకుండా ఎలా బతకాలో చుట్టు పక్కలవాళ్లని ఎలా బతికించాలో చిన్న పిల్లలనుంచి వృద్ధుల వరకు నేర్పేఒక వ్యక్తిత్వ వికాస విశ్వవిద్యాలయం భగవద్గీత. ఆ దృష్టితో అన్నమయ్య చూసిన భగవద్గీతని విడమర్చి చెప్పటం ఈ పుస్తకం పరమోద్దేశ్యం. ఈ ఆలోచనని పుణ్య విశేషం వలన సుజనరంజని వ్యవస్థాపకులు శ్రీమహీధర సీతారామశర్మగారిలో అన్నమయ్య కలిగించాడు. నా పురాకృత సుకృత ఫలితంగా సీతారామ శర్మగారు ఈ ఆలోచనకు పుస్తక రూపం కలిగించమని నన్ను కోరారు. తలకుమించినదే అయినా తలపులు నమ్ముకొన్న వాడు ఇస్తాడనే శరణాగత బుద్ధితో అంగీకరించాను.

శ్రీ సీతారామశర్మగారు అన్నమయ్య పద శింజిని. వారు ఒక వ్యక్తి కాదు. ఒక సేవా వ్యవస్థ. నేను అన్నమాటలు అన్నమయ్య నా చేత అనిపిస్తున్నవి. లక్షల కొలది వ్యయంతో **అన్నమయ్య పద మందాకిని,** సి.డి.తో బయటకు వచ్చిందంటే అది ఈ రోజుల్లో మామూలు విషయంకాదు. వారి సేవా నిరతిని, నిజాయితీని గమనించి అన్నమయ్య వేంకటేశ్వరుడు వారికి ఉదార హృదయుల ద్వారా విత్త సౌభాగ్యం కలిగించి, సుజనరంజని ద్వారా సంగీత సాహిత్య ప్రియుల ముందు ప్రత్యక్ష మవుతున్నాడు. అటువంటి సహృదయులు, ఈ పుస్తకం వ్రాయించటానికి ప్రధాన ప్రేరకులయిన శ్రీ మహీధర సీతారామశర్మగారికి, వారి కుటుంబ సభ్యులందరికి శ్రీ అన్నమయ్య వేంకటేశుడు ఇతోధిక శుభాలను ప్రసాదించాలని హృదయ పూర్వకంగా ప్రార్థిస్తున్నాను.

గౌరవనీయులు పద్మభూషణ్ డా. కె.ఐ.వరప్రసాద్ రెడ్డిగారు తమ తండ్రిగారి జ్ఞాపకార్థం ఈ పుస్తకాన్ని తమ ట్రస్ట్ తరపున ప్రచురిస్తున్నందుకు వారికి సర్వథా కృతజ్ఞుడిని. వారికి, వారి కుటుంబ సభ్యులకు అన్నమయ్య సమేత శ్రీవేంకటేశ్వరుడు ఇతోధిక ఆరోగ్యైశ్వర్యాభివృద్ధులు కలిగించాలని వినుతి. అన్నమయ్య ఆశీర్వచనాలు దండిగా అందుకొన్న అదృష్టవంతుడు, నన్ను అభిమానించే సహృదయ మిత్రులు శ్రీ జి.బి. శంకరరావుగారికి, అన్నమయ్య రాగాన్ని గొంతులో, శ్రోతల అనురాగాన్ని హృదయంలో నిల్పుకొని సంగీతోపాసన చేస్తున్న మిత్రుడు శ్రీ సత్తిరాజు వేణుమాధవ్ గారికి, ముద్రణా చిద్విలాసి శ్రీమతి & శ్రీ పుట్టా కోటేశ్వరరావుగారికి, తన గొంతుని గీతగా మార్చుకొన్న శ్రీ గడ్డమణుగు రామకృష్ణ గారికి ధన్యవాదములు.

ఒక విచిత్రం. ఈ రచనను ప్రారంభిస్తున్నప్పుడు అనుకోకుండా తాళ్లపాక పెద తిరుమలాచార్యులవారు వ్రాసిన *శ్రీభగవద్గీతకు తొలితెలుగు భావానువాదం* పుస్తకం చూసే అదృష్టం కలిగింది. 'ఒరేయ్! జాగ్రత్తగా వ్రాయి' అని ఆశీర్వదిస్తూ సాహితీమిత్రులు శ్రీ శంకరనారాయణ గారి ద్వారా అన్నమయ్య ఇది నాకు పంపించిఉంటాడు. అనుమానమే లేదు. ఇన్నాళ్లనుంచి నాకు లభించని పుస్తకం – ఈ అన్నమయ్య భగవద్గీతోపదేశ రచనా ప్రారంభంలో దొరకటం అన్నమయ్య వేంకటేశుని అనుగ్రహమే.

అన్నమయ్య గీతం, దానికి సంబంధించి భగవద్గీతలో ఉన్న ప్రధానమైన శ్లోకం, దానికి పెదతిరుమలయ్య వ్రాసిన భావం, తదుపరి లఘు విశ్లేషణ – ఇది నేను ఒక్కొక్క గీతానికి అనుసరించిన మార్గం.

పెదతిరుమలయ్య ఇచ్చిన అర్థాన్ని యథాతథంగా ఇందులో ఉదహరించాను. ఆప్పటి భాష లోని ఒత్తులు, సంశ్లేషాలు, వ్యావహారికపు నుడిని – ఇప్పటి తరమైన మనం – అర్థం చేసుకోవటంలో కొంత ఇబ్బంది పడినప్పటికీ – దైవానుగ్రహం ఉన్న భక్తుడు రాసిన భాష కనుక ఉన్నదున్నట్టు ఉటంకించాను. పాఠకుల సౌకర్యార్థం పెద తిరుమలయ్య చెప్పిన అర్థం – ఇప్పటి మన భాషలో – భావ విశేషాలలో సందర్భానుసారంగా తెలియచేసాను.

విశ్లేషణలో రాసిన ప్రతి అర్థానికి, ఉదాహృతికి ప్రామాణికత ఉందని మనవి చేస్తున్నాను. ఒక్కో కీర్తనకు మేము ఎంచుకొన్న రెండు పుటల పరిమితి మేరకు, సాధ్యమైనంతవరకు ప్రామాణిక ఆధారాలను కుండలీకరణాలలో తెలియచేసాను.

అటు పూజలలో శుభకార్యాలలో పంచె, ఇటు కళాశాలకు వెళ్లేటప్పుడు పాంటు – వేసుకొనే మిశ్రితమైన వాతావరణంలో ఉంటున్నాను కనుక – గ్రాంథికం, వ్యావహారికం కలిసిపోయిన భాషా శైలి – ఈ పుస్తకంలో అనివార్యమైంది.

ఇందులో ఉదహరించిన గీతా శ్లోకాల సంఖ్య గీతా ప్రెస్ ప్రచురించిన శ్రీజయదయాల్ గోయందకా వ్యాఖ్యానంలో వచ్చిన శ్రీమద్భగవద్గీతా వ్యాఖ్యానంలోనివి. పాఠకులు గమనించ మనవి.

గోవర్ధనగిరి భారం మోసి గోపాలకులను కాపాడిన స్వామి – ఈ పుస్తక రచనాభారంకూడ మోసి, నన్నొక ఉపకరణంగా వాడుకొని అన్నమయ్య గీతోపదేశాన్ని లోకానికి అందించాడు. ఆ స్వామి చిరునవ్వుల కోశం ఈ అన్నమయ్య గీతోపదేశాల పుస్తకం.

నన్ను ఆశీర్వదిస్తూ, సాధికారికమైన పీఠికలు సంతరించిన విద్వన్మణులు డా. సముద్రాల లక్ష్మణయ్యగారికి, శ్రీయస్ లక్ష్మణమూర్తిగారికి, డా. పప్పు వేణుగోపాలరావుగారికి హృదయ పూర్వక ధన్యవాదములు.

బ్రహ్మ సూత్రాల దగ్గరినుంచి, గీతా భాష్యాలు, అమరకోశాది సంస్కృతాంధ్ర నిఘంటువులు, కావ్యాలు, పురాణాలు మొదలైన ఎన్నో పుస్తకాలు ఈ పామరుడికి అన్నమయ్యను అర్థం చేసుకోవటంలో సహకరించాయి.

ఆ గ్రంథ కర్తలందరికి శిరస్సువంచి నమస్సులు అర్పించుకొంటున్నాను. నా శ్రీమతి టి. మీనాక్షి, పిల్లలు చి॥ దీప్తి, చి॥ కావ్యల తోడ్పాటు లేనిదే ఈ పుస్తక రచన పూర్తి అయ్యేది కాదు. గంటలు, గంటలు నన్ను కంప్యూటర్‌తో, పుస్తకాలతో వదిలేసి, నా పుస్తక రచనకు సహకరించిన కుటుంబ సభ్యులందరికి ప్రేమ పూర్వక ప్రశ్రయములు.

***డా॥ తాడేపల్లి పతంజలి***

# నివేదన

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య**
స్పెషల్ ఆఫీసర్
పురాణ ఇతిహాస ప్రాజెక్టు
*తిరుమల తిరుపతి దేవస్థానం,* తిరుపతి.

అన్నమయ్య సంకీర్తనలు వేదాలకు మారు రూపాలుగా ప్రశస్తి పొందాయి. వేదాలలో కర్మ–భక్తి–ధ్యాన–జ్ఞాన యోగాల వివరణ లభిస్తుంది. అన్నమాచార్యుల సంకీర్తనలలో గూడా పై యోగాలను పరికించవచ్చు. అయితే అక్కడ భక్తి, ప్రపత్తి మార్గాలకు ఇతర యోగాల కంటే ఎక్కువ ప్రాచుర్యం గోచరిస్తుంది.

గీత సకల వేదార్థ సార సంగ్రహం. శ్రీ శంకరభగవత్పాదులు తమ గీతాభాష్యంలో "తదిదం గీతాశాస్త్రం సమస్త వేదార్థసార సంగ్రహం భూతమ్" అని గీతాశాస్త్రాన్ని ప్రశంసించారు.

గీతలో కూడా కర్మాదియోగాల వివరణ కనిపిస్తుంది. అందులోనూ

భక్త్యాత్వనన్యయా శక్యః / అహమేవం విధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన / ప్రవేష్టుం చ పరంతప!

ఇత్యాదిశ్లోకాలలో భక్తి యోగ ప్రాచుర్యం పేర్కొనబడింది. చరమశ్లోకంలో (సర్వ ధర్మాన్ పరిత్యజ్య) శరణాగతి విశిష్టత కీర్తింపబడింది.

గీతకూ, అన్నమయ్య పదాలకూ గూడా వేదార్థ ప్రతిపాదనమే ముఖ్యోద్దేశం కాబట్టి విషయ నిరూపణలో పై రెండింటికీ సామ్యం ఉండక తప్పదు.

విశేషించి ఈ యుగంలో విస్తృత ప్రచారం పొందిన గ్రంథం గీత. సులభ సంస్కృతంలో మోక్షప్రాప్తి కవసరమైన బ్రహ్మవిద్యను గీత శ్రీకృష్ణార్జున సంవాద రూపంగా లోకాని కందించింది. అందుకే దీనిని 'గీతాయుగ' మన్నారు. శ్రీమలయాళస్వామి, శ్రీ విద్యాప్రకాశానందస్వామి వంటి మహనీయులు ఇటీవల ఆంధ్రావనిలో గీతకు అనన్య సామాన్యమైన ప్రచారం కల్గించారు.

అన్నమయ్యకు ఆధ్యాత్మిక తత్త్వ ప్రబోధానికి గీతలోని అంశాలు ఎంతగానో ఉపకరించాయి.

"దేహి నిత్యుడు దేహములనిత్యాలు" ఇత్యాది సంకీర్తనల్లో గీతాశ్లోకాలనే ఆయన అనువదించాడు. "అని యానతిచ్చె కృష్ణుడర్జునునితో" ఇత్యాదులలో కృష్ణార్జునుల పేర్లని పేర్కొని గీతార్థాలను వివరించాడు.

"నిండు మనసే నీపూజ" ఇత్యాదులలో గీతలోని గుణత్రయాతీతుడు, స్థితప్రజ్ఞుడు మున్నగు ఆత్మవేత్తలు ఎట్టి వారో విశదీకరించాడు. ఇలా పరిశీలిస్తూ పోతే అన్నమయ్య కీర్తనలకూ, గీతకూ గల పోలిక మిక్కిలి ఆసక్తిదాయకమైన అధ్యయన విషయంగా సాక్షాత్కరిస్తుంది.

అన్నమయ్య వాఙ్మయంపై విశ్లేషణాత్మకమైన వివరణలతో గూడిన గ్రంథాలు ఈకాలంలో చాలా వెలువడుతున్నాయి. 1976లో నేను గూడా 150 అన్నమయ్య ఆధ్యాత్మిక కీర్తనలకు 'అన్నమాచార్య

సంకీర్తనామృతము' అన్న పేరుతో వ్యాఖ్యానం వ్రాశాను. అది ఇప్పుడు తి.తి.దే. ప్రచురణలలో ఒకటి.

శాస్త్రీయ సంగీత ప్రచారం పరమావధిగా ప్రతిష్ఠితమైన **"సుజనరంజని"** అనే సాంస్కృతిక సంస్థ అన్నమయ్య వాఙ్మయం పట్ల శ్రద్ధతో దానికి విస్తృత ప్రచారం కల్గించాలని సంకల్పించడం ముదావహం. గతసంవత్సరం ఈ సంస్థవారు శ్రీ జి.బి శంకరరావు గారి వివరణతో గూడిన **"అన్నమయ్య పదమందాకిని"** అనే గ్రంథాన్ని ప్రచురించారు. అది పెక్కుమంది ప్రముఖుల ప్రశంసలకు పాత్రమై గణన గాంచింది.

ఇప్పుడు డా॥ తాడేపల్లి పతంజలి గారు రచించిన **'అన్నమయ్య గీతోపదేశాలు'** అన్న కృతిని సుజనరంజని సంస్థ అన్నమయ్య జయంతి శుభసందర్భంలో వెలుగులోకి తెస్తున్నది. డా॥ పతంజలి గారు అన్నమయ్య వాఙ్మయంలో ఎంతో కృషి చేశారు. పెక్కు కీర్తనలకు విశ్లేషణాత్మకమైన వీరి వివరణలను 'సాక్షి' పత్రికలో పాఠకులు పఠించి సంతోషించారు. శ్రీ శంకరరావు గారికి లాగానే డా॥ పతంజలిగారికి గూడా సహజంగానే అన్నమయ్య వాఙ్మయంపై ఎనలేని అభిరుచి జనించింది. దాని ఫలమే ఈ గ్రంథం.

ఇందులో 25 సంకీర్తనలు పరిగ్రహించి వాటిలోని భావాలకూ, గీతలోని అభిప్రాయాలకూ గల సాదృశ్యాన్ని విశదీకరించి దానికనుబంధంగా ఇతరాంశాలను గూడా జోడిస్తూ ఈ కృతిని సిద్ధం చేయడమయింది.

'ఏదియును లేని దేమిజన్మము / వేదాంతవిద్యా వివేకి గావలెను'

అన్న అన్నమయ్య ప్రబోధాన్ని స్మరిస్తూ ఆధ్యాత్మికవిద్యా వివేకం కల్గించే ఇట్టి తులనాత్మక రచనను రూపొందించిన డా॥పతంజలి గారు ధన్యజన్ములు.

ఈ గ్రంథంలో అన్నమయ్య కీర్తన, తదనుగణభావప్రతిపాదకమైన గీతాశ్లోకంతో పాటు శ్రీ పెదతిరుమలాచార్యులు ఆశ్లోకానికి సమకూర్చిన భావం గూడా పొందుపరిచారు. ఇదొక రకమైన త్రివేణీ సంగమం. ఆసంగమ వైశిష్ట్యాన్ని వివరించేది ఇందలి భావ విశేషాలు.

రచయితలు రచనలు చేస్తారు. వాటిని వెలుగులోకి తెచ్చే సంస్థలు లేకుంటే అవి అసూర్యం పశ్యలు గానే వుండి పోతాయి. **'సుజనరంజని సంస్థ'** ను స్థాపించిన శ్రీ మహీధర సీతారామశర్మ గారు ఈ రచనకు ప్రేరకములే కాక ప్రకాశకులుగా కూడా తమ వంతు పాత్రను విజయవంతంగా నిర్వహించి అన్నమాచార్య వాఙ్మయారాధకులకు అభినందనీయులయ్యారు.

శ్రీ **సుజనరంజని సంస్థ** లోకోపకారక దృష్టితో చేస్తున్న ఈ కృషి ఇంకా ముమ్ముందుకు సాగి భవిష్యత్తులో శరపరంపరగా ఇట్టి సత్కార్యాలు నిర్వహించునట్లు శ్రీనివాసుడనుగ్రహించుగాక!

సకలవేదములను సంకీర్తనములుగా
సంఘటించి హరిని సన్నుతించి
ముక్తి జూఱగొన్న మునివర్యు నన్నమా
చార్యు భక్తితోడ సంస్మరింతు

2-5-2011 — *డా॥ సముద్రాల లక్ష్మణయ్య*

తిరుపతి

**Prof. S. Lakshmana Murty,**
5-11-674, Warangal
Ph. : 0870-2439252, Mobile : 9959876675

## ముందుమాట

శ్రీతాళ్ళపాక అన్నమాచార్యులవారి సంకీర్తనామృతం గ్రోలి అలౌకికానందం పొందేవారందరికీ, కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు ప్రాతః స్మరణీయులు. 'ప్రభాకర' కరస్పర్శతో వందలేండ్ల చీకటి నేలమాళిగ ఏకాంతవాసం నుండి విముక్తమై వెలుగొందిన అన్నమయ్య సంకీర్తన నిధి తెలుగు సాహిత్యాన్ని సంపన్నం చేసింది, పావనం చేసింది.

ఐదువందలేండ్లకు పూర్వమే ప్రతిదినమొకటిగా, జీవిత చరమాంకం దాకా, ఆ మహానుభావుడు విరచించి ప్రసాదించిన నిక్కమైన పసిడిముక్కలవంటి ముప్పదియారువేల సంకీర్తనలలో కనీసం సగమైనా లభించడం తెలుగువారి పుణ్య పరీపాక ఫలం.

భక్తినీ, కవిత్వాన్నీ, సంగీతాన్ని మేళవించి రూపించిన పవిత్ర త్రిపథగనేకాదు, అపారమైన అమృత ప్రాయమైన అచ్చమైన తెలుగు శబ్దభాండారాన్నీ అన్నమయ్య మనకు అనుగ్రహించినారు. తెలుగు మాట్లాడే మనమంతా ఆయనకు శాశ్వతంగా ఋణపడ్డాం.

అన్నమయ్య సంకీర్తనలు ఆవిష్కృతమైన నాటినుండి, భక్తులు భవతరణోపాయాన్ని, గాయకులు కమనీయ సంగీత పీయూషాన్ని, పండితులు అమోఘశబ్దబాహుళ్యాన్నీ అప్రయత్నంగా పొంది ఆనందిస్తూ ఆయననూ ఆరాధిస్తూనే ఉన్నారు.

కొన్న శతాబ్దాల కాలం ఫలసాయాన్ని పర్యాప్తంగా పండించే సాహిత్య వ్యవసాయ క్షేత్రమై, అన్నమయ్య సంకీర్తన సందోహం, అనర్ఘ రత్నగర్భగా విరాజిల్లుతుమది. ఆ క్షేత్రంలో తెలుగునాట పండిత కృషీవలులెందరో పరిశ్రమిస్తూనే ఉన్నారు. వారిలో డా. తాడేపల్లి పతంజలి ఎన్నదగినవారు. ఒక ప్రముఖ వార పత్రికలో అన్నమాచార్యులసంకీర్తనల సొబగులను ఆవిష్కరించి పాఠకలోకం మన్ననలను పొందినవారు.

అన్నమయ్య సంకీర్తనలలో భక్తి, జ్ఞాన వైరాగ్య శృంగారాలే కాదు, వ్యక్తిత్వ వికాస సోపానాలు దర్శనమిస్తాయి. ఉపనిషత్తుల సారంగా కీర్తించబడే భగవద్గీతలోనూ మానవ జీవనవికాసమార్గమూ గమ్యమూ నిర్దేశింపబడినాయి. అన్నమయ్య సంకీర్తనలకీ భగవద్గీతకీ ఆధ్యాత్మిక భూమిక ఒకటే కావడం మూలాన, గాఢంగా మననం చేసిన వారికి వాటి సారూప్యం స్పష్టమౌతుంది. "వ్యక్తిత్వ వికాసంతో నిజమైన బతుకు ఎలా బతకాలో నేర్పే భగవద్గీతా సారాన్ని అన్నమయ్య కీర్తనలలో వివరించాడు" అని తెలిపి, డా.పతంజలి సులభమైన శైలిలో సుందరంగా 25 సంకీర్తనలని విశ్లేషించినారు. సంకీర్తనతో సారూప్యం కలిగిన భగవద్గీతా శ్లోకాన్ని ఉదాహరించి , అన్నమయ్య కుమారుడు పెదతిరుమలయ్య భగవద్గీతకు చేసిన తొలి తెలుగు బావానువాదాన్ని పొందుపరచినారు. (తొలి సంకీర్తనాచార్యుడు, తొలి తెలుగు కవయిత్రి, తొలి తెలుగు భగవద్గీతా భావానువాద కర్త, తాళ్ళపాక వారే కావడం

"అని యానతిచ్చె కృష్ణుడర్జునునితో" ఇత్యాదులలో కృష్ణార్జునుల పేర్లని పేర్కొని గీతార్థాలను వివరించాడు.

"నిండు మనసే నీపూజ" ఇత్యాదులలో గీతలోని గుణత్రయాతీతుడు, స్థితప్రజ్ఞుడు మున్నగు ఆత్మవేత్తలు ఎట్టి వారో విశదీకరించాడు. ఇలా పరిశీలిస్తూ పోతే అన్నమయ్య కీర్తనలకూ, గీతకూ గల పోలిక మిక్కిలి ఆసక్తిదాయకమైన అధ్యయన విషయంగా సాక్షాత్కరిస్తుంది.

అన్నమయ్య వాఙ్మయంపై విశ్లేషణాత్మకమైన వివరణలతో గూడిన గ్రంథాలు ఈ కాలంలో అరుదైన విశేషం.) దీనితో డా. పతంజలి వ్యాఖ్యానం ఎంత సహజమైందో తెలుస్తుంది. ఎక్కడా అర్థాన్ని బలవంతంగా రాబట్టినట్లు లేదు, అనవసరమైన వివరణమూ లేదు. పిన్నలు, పెద్దలు మననం చేసి అనుసరింపదగిన వ్యక్తిత్వవికాసమార్గాన్నీ నిర్దేశించినారు.

కాలగమనంలో కనుమరుగై అర్థ స్పష్టతను కోల్పోయిన పదాలనెన్నింటినో వివరించినారు. (ఇప్పటికీ అన్నమయ్య సంకీర్తనలలో అర్థం స్పష్టంగా తెలియని పదాలు కోకొల్లలు.) చెణుకులతో, చమత్కారాలతో వ్యాఖ్యానాన్ని ఆద్యంతమూ ఆసక్తికరంగా చేసినారు.

అందరూ అలవోకగా చదువుకొని ఆనందించవచ్చు.

"సుజనరంజని" వ్యవస్థాపకులు శ్రీ మహీధర సీతారామ శర్మగారి ఆలోచనను డా. పతంజలి సాకారం చేసినారు.

సౌజన్యమూ, సంస్కారమూ మూర్తీభవించి వ్యక్తిత్వ వికాసానికి ప్రత్యక్ష రూపమైన పద్మభూషణ్ డా. కే. ఐ. వరప్రసాద్ రెడ్డిగారు తమ తండ్రిగారి స్మృత్యంకనంగా మనందరికీ అన్నమయ్య చూపిన భగవద్గీతని అందించినారు.

వారికి ధన్యవాదములు.

ఈ నాలుగు వాక్యాలని 'ముందుమాట'గా వ్రాసే అవకాశం కలుగడం నా అదృష్టంగా భావిస్తున్నాను.

వరంగల్లు — *ప్రొ॥ ఎస్. లక్ష్మణ మూర్తి*
05-05-2011.

అన్నమయ్య గీతోపదేశాలు

*డా॥ పప్పువేణుగోపాలరావు*
Secretary, The Music Acadmy, Chennai
Member, Sangeet Natak Acadmy, New Delhi

## ఆముఖము

తాళ్ళపాక అన్నమాచార్యులవంటి వాగ్గేయకారులు ప్రపంచ వాఙ్మయంలో లేరు అని నిర్ధారించి చెప్పవచ్చు. అన్నమాచార్యులవారి సాహిత్యము ఒక భక్తి భావ తరంగిత అంతరంగమునుండి దివిజగంగయై ప్రవహించినది. అది సంగీత సాహిత్య క్షేత్రములందు, ఆధ్యాత్మిక సాంఘిక రంగములందు, లౌకిక, పారలౌకిక పరిధులను పునీతము చేసిన సజీవ సంగీత సాహిత్య స్రోతస్విని.

నందకాంశ సంభూతుడై జన్మించిన అన్నమయ్యవాక్కు అసిధారవలె పదునైనది. కాని ప్రాపంచిక సుఖములలో, సాంసారిక బంధములలో కొట్టుమిట్టాడు మానవులపై అన్నమయ్యకు అపారమైన కరుణ, అవ్యాజమైన అనుగ్రహము, అపరిమితమైన వాత్సల్యము.

మాన్యులు వేటూరి ప్రభాకర శాస్త్రి గారు మనకు ఈనాడు లభించిన పదునాలుగు వేల పైచిలుకు అన్నమయ్య సంకీర్తనలను వింగడించి అన్నమయ్య దాదాపు 50కు మించిన ప్రక్రియలలో పదరచన చేసినాడని నుడివియున్నారు. **"ఒక్క సంకీర్తనే చాలు ఒద్దికై మమ్ము రక్షింపగ తక్కినవి భండారాన దాచియుండనీ**" అని చెప్పి తన రచనలను శ్రీనివాసుని ఆలయ ప్రాంగణమున భద్రపరచిన ఒక అనన్య భక్త శిఖామణి అన్నమయ్య. ఆయనకు యశః కామన లేదు. ముప్పది రెండు వేల సంకీర్తనలలో తన పేరు ఎక్కడా చెప్పుకొనలేదు. ఒకటి రెండు చోట్ల తన పేరు కనిపించినచో అవి నా దృష్టిలో కాల్పనికములు (interpolation). అంతటి అన్నమాచార్యులవారిని కేవలం ఒక వాగ్గేయకారునిగానో, సాహిత్య స్రష్టగానో, ద్రష్టగానో పద కవితాపితామహునిగానో ఎన్నిరకములుగా చూసిననూ అవి ఆయన వ్యక్తిత్వమును పరిమితము చేయునే గాని, సంపూర్ణముగా పట్టియిచ్చునవి కావు. ఆయన పరమ భావుక చక్రవర్తి. పద కవితా సార్వ భౌముడు. మానవ జాతిని ఉద్ధరించుటకు అవతరించిన మహా పురుషుడు.

అన్నమాచార్యులవారి సంకీర్తనలలో రకరకముల సంకీర్తనములున్నవి. అతనెంతటివాడో అంతకు తగిన కుమారుడు తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారు. ప్రపంచమునకు ఇంకనూ తెలియని విషయములలో ఒకటి పెదతిరుమలయ్య వ్రాసిన భగవద్గీత అనువాదము.

తాడేపల్లి పతంజలిగారు అసామాన్యమైన వరివస్య గలిగిన పండితుడు. వారు ధారావాహికముగా అన్నమయ్య పదములకు వ్రాయుచున్న వ్యాఖ్య పండితశుండాలముల శ్లాఘా శిరః కంపన ములందుకొన్నవి. వారు అన్నమయ్య ఇరువది ఐదు పదములను ఎంచుకొని భగవద్గీత శ్లోకములకు అన్వయించిన రచన ఇది. ఈ ఇరువది ఐదులో చాల పదములు చాలమందికి తెలిసినవి. 'నగవులు నిజమని నమ్మేదా!, ఏకులజుడైన నేమి, అంతయు నీవే హరి పుండరీకాక్ష, తందనాన ఆహి, తెలిసితే మోక్షము, పురుషోత్తముడ నీవు" మొదలైనవి. ఒక్కొక్క పదము, దానికి సమానమైన భగవద్గీత శ్లోకము, పిమ్మట పెద తిరుమలయ్య వ్రాసిన అనువాదము వ్రాసి పతంజలిగారు ఒక్కొక్క

పాదమున, ఒక్కొక్క చరణమున ఆ భగవద్గీత శ్లోకము ఎట్లు అన్వయించుచున్నదో తెలియజెప్పెడి మహత్తరమైన రచన ఇది. పతంజలిగారి పాండిత్యము భగవద్గీతతో పరిమితము గాక, అటనట ఉపనిషత్తులను కూడ ఉదహరించుటయందు కనిపించుచున్నది. ఈ గ్రంథమును, ఈ విషయమును, ఈ శైలిలో ఇంతకుమించి వ్రాయుట అనితర సాధ్యము.

అన్నమయ్య యొక్క విశ్వరూపమును ప్రదర్శించుటకు పరిశోధనలు జరుగుచున్నవి. సాహితీ వేత్తలు వారివారి దృక్కోణములనుండి వ్యాఖ్యలు చేయుచున్నారు. సంగీతజ్ఞులు వారి స్వరములను స్వరపరచుచున్నారు. ఆధ్యాత్మిక తత్త్వవేత్తలు అన్నమయ్య సాహిత్యమున గల తత్త్వరహస్యములను వెదకి తీయుచున్నారు. నాట్యాచార్యులు అన్నమయ్య రచనలకు నృత్య రూప కల్పనలు చేయుచున్నారు. ఎవరెన్ని చేసిననూ ఇంకనూ తరగని నిక్షేపము, ఒక నిధి అన్నమయ్య సాహిత్యము. తాడేపల్లి పతంజలివంటివారు ఈ మార్గమున చేయుచున్న కృషి అబినందనీయము. వారి రచన అనేకులకు మార్గదర్శకము కాగలదు!

కుజన హృదయ ప్రభంజనమై, సుజన రంజనమైన ఈ రచనను ప్రచురించుచున్న **"సుజనరంజని"** సంస్థకు ప్రత్యేకించి మహీధర సీతారామశర్మగారికి మంగళాశాసనములు.

ఇతి శం

శ్రీఖర వైశాఖ శుద్ధ పంచమి

***డా॥ పప్పువేణుగోపాలరావు***

# వరప్రసాద్ హృదయలేఖిని నుండి....

ఆత్మీయులకు నమస్కారం.

సంతానం గురించి అహరహమూ శ్రమించే తండ్రికి దక్కవలసినంత గుర్తింపు దక్కడం లేదన్నది వాస్తవం. తల్లి ప్రథమ పూజనీయురాలైతే, తండ్రి కూడా ఆ గౌరవం పొందడంలో 'అద్వితీయుడే'. నాకీ రోజు ఏ కాస్త విద్య అబ్బిన, పదిమందికి ఉపాధి కల్పించే పరిశ్రమ నెలకొల్పగలిగే శక్తి కలిగినా నాలో ఉన్న మా తండ్రి అంశ కూడా కారణమే!

మా నాన్న గారి తృతీయ వర్ధంతి సందర్భంగా ఐదు సంవత్సరాల క్రితం మీ అందరికి శ్రీ రాంభట్ల నృసింహ శర్మ గారు వ్రాసిన **"తండ్రీ నిన్ను దలంచి...."** అనే చిన్న పుస్తకాన్ని అందజేశాం. సేవాదులలో తల్లిని దేవత వలే, ఆజ్ఞా పరిపాలనలో తండ్రిని దైవంగా భావించాలన్న వేద నిర్ణయాన్ని శ్రీ రాంభట్ల అద్భుతంగా ఆవిష్కరించారు. ఒక యువకుడు గృహస్థుగా, తండ్రిగా ఎలా పరివర్తన చెందుతాడో, పుత్రుల ప్రేమ చూరగొనాలంటే అతను ఏమి చేయాలో, ఆ వాత్సల్యానికి అర్హత సంపాదించుకోవాలంటే కుమారుడు ఏంచేయాలో పలు గ్రంథాలనుండి, వ్యాఖ్యాసహితంగా నిరూపించారు.

నాలుగు సంవత్సరాల అనంతరం పురాణేతిహాసాలలో, ప్రబంధ కావ్యాలలో ప్రస్తావనకొచ్చే తండ్రి ప్రశస్తి గురించి మరిన్ని విశేషాలతో మరొక పుస్తకాన్ని వ్రాయించాలన్న తలంపు కలిగి పంచసహస్రావధాని డా॥ మేడసాని మోహన్ గారిని కోరడం జరిగింది. నా కోరికను మన్నించిన డా॥ మోహన్ గారు తండ్రి ప్రస్తావన పురాణాలను, ఇతిహాసాలను, కావ్యాలను పరామర్శించి సరళమైన వ్యాఖ్యతో **"తండ్రి పరమ పూజ్యుడు...."** అనే పుస్తకాన్ని వ్రాశారు.

మనందరికి తండ్రి పట్ల ఆరాధన, ఆత్మీయతా భావం పెరుగుతాయన్న ఆశయం ఇటువంటి ప్రయత్నాలవలన నెరవేతుందని నా నమ్మకం. తల్లిదండ్రులను వృద్ధాశ్రమానికి తరలించబోయే ఏవ్యక్తి అయినా ఈ పుస్తకాలను చదివి తననిర్ణయాన్ని మార్చుకుంటే మాకంటే ధన్యులు వేరెవ్వరూ ఉండరని భావంతోనే వాటిని వ్రాయించడం జరిగింది.

ఈ సారి మాకు తారసిల్లిన పుస్తకం విలక్షణమైనది. **"అన్నమయ్య గీతోపదేశం"** అనే ఈ పుస్తకాన్ని **సుజనరంజని సంస్థ** వారు డా॥ తాడేపల్లి పతంజలి గారి చేత వ్రాయించారు. మా నాన్న గారు అవలంబించిన జీవనసరళికి దగ్గరగా ఉందనే కారణంగా మేము వారికి సహకరించి ఈ పుస్తకాన్ని సాధ్యమైనంత ఎక్కువ మందికి చేరవేసేందుకు కృషి చేస్తున్నాం.

హిందూ మతంలో ఉన్న సారాన్నంతా భగవద్గీత లోనే పద్దెనిమిది అధ్యాయాలలో చూడ వచ్చు. విషాదంలో, సందిగ్ధంలో మునిగి కర్తవ్యతావిమూఢుడైన 'నరుడి'కి 'నారాయణుడు' ఉపదేశించిన జీవన మార్గమది. ప్రతి జీవి తనకు విహితమైన కర్మ ఏవిధంగా, ఎటువంటి దృక్పథంతో చేయాలో, భగవత్స్వరూపాన్ని ఎరిగి, మోహాలనుండి విముక్తుడై, ఆత్మ నిత్యత్వాన్ని, జన్మల అశాశ్వతత్వాన్ని తెలుసుకుని ఆ సర్వేశ్వరుని శరణు వేడే యోగాన్ని ఎలా అవలంబించాలో చెబుతుంది.

గీత సంస్కృతంలో ఉండడం చేత దానిలోని జ్ఞాన బోధ సామాన్య జనులకు అందుబాటులో ఉండదన్న ఉద్దేశ్యంతో అన్నమయ్య గీతాసారాన్ని చక్కటి తెలుగు గేయాలుగా మార్చి కీర్తనల రూపంలో

వ్యాప్తి చేశారు. అందరికి బాగా పరిచయమైన గీతా శ్లోకం "వాసాంసి జీర్ణాని" కి తెలుగు రూపమైన అన్నమయ్య కీర్తన 'దేహి నిత్యుడు, దేహములనిత్యాలు' లో చరణం చూడండి –

'గుది బాత చీర మాని కొత్త చీర గట్టినట్టు, / ముది మేను మాని దేహిమొగి గొత్త మేను మోచు, అదే చరణంలోని – 'అదనజంపగ లేవు ఆయుధములీతని, గదిసి అగ్నియు నీరు గాలియు చంపగ లేవు...' అనే భాగం 'నైనం ఛిన్దంతి శస్త్రాణి...' స్ఫూర్తిగా వ్రాసినది.

భగవద్గీతలో "తస్మాత్ సర్వేషు కాలేషు (సర్వకాలములందు) మామనుస్మర... (నన్ను స్మరింపుము)" అని శ్లోకం ఉంటే అన్నమయ్య ఆ సర్వకాలాలు ఎటువంటివో వివరంగా చెప్పారు, "ఇహపరసాధనమీతలపు..." కీర్తనలో 'సిరులు ముంగిటను జిగి దడబడినా, సరిగాంతలెదుట సందడి గొనిన, ఒడలి వయోమదముప్పతిల్లినా, సుఖదుఃఖములు ముంచినా, మతి సంసారపు మాయ గప్పినా...' ఎటువంటి అవస్థలోనైనా సరే, 'గతియై శ్రీవేంకటపతి గాచినా, సతతం నితని శరణమే తలపు...' అని చెప్పారు.

అలాగే భగవద్గీతలో "అహింసా సత్యమక్రోధః త్యాగః..." శ్లోకంలో ఎటువంటి గుణాలు మనకు దేవుణ్ని చేరువ చేస్తాయో చెబితే అన్నమయ్య 'ఎంతచదివిననేమి...' కీర్తనలో ఫలానా ఫలానా పనులు మానకపోతే ఎంత చదివితే ఏం లాభం, దైవకృప అనే సిరి కలుగదు, గతి ఉండదు అని చెబుతూ ఆ పనులేమిటో చెప్పారు– ఇతరుల పట్ల దూషణ వాక్యాలు, అతి కాముకత, చంచలత్వం, పరధనాల పట్ల ఆశ, విలాసవర్తనం, బొంకు మాటలు ఇలాటివి మానేసి వేంకటపతిని ఆత్మలో వెతికితే కాని జయం కలుగదు. అని చెప్పారు.

భగద్గీతలో దేవుని దృష్టిలో అందరూ సమానమే, అందరిలోను ఉండే ఆత్మ ఒకటే అని తెలిపే "సమం పశ్యన్ హి సర్వత్ర..." శ్లోకం ఉంటే అన్నమయ్య "సమబుద్ధే యిందరికి...." కీర్తనలో 'చీమకు దన జన్మము చేరి సుఖమై తోచు, దోమకు దన జన్మము దొడ్డ సుఖము....", 'జంతు రాసులకు నెల్లా జననములొక్కటే, అంతటాను మరణములవి యొక్కటే... నాహార నిద్రలు స్త్రీ సుఖాలొక్కటే' అని విపులీకరించి చెప్పారు. అందరిలో దేవుడున్నాడని చెబుతూ 'యెందు జూచినా నీ తడిందరిలో నంతరాత్మ చందముగా...' అన్నారు.

భగవద్గీతలోని ఏయే శ్లోకాల బావాలను అన్నమయ్య తన కీర్తనల ద్వారా వెలార్చారో పరిశీలించడానికి డా॥ పతంజలి వేలాది అన్నమయ్య కీర్తనలను, భగవద్గీతలోని 18 అధ్యాయాలను పరామర్శించి ఈ రచన సాగించారు. గీతలోని శ్లోకం నాలుగుపాదాలలో ముగిసి పోతుంది. దాని భావాన్ని విశదీకరించడానికి, కవిత్వ రూపంలో చెప్పడానికి 14 పాదాల కీర్తన రాశారు అన్నమయ్య. గీతా శ్లోకం పండితులను ఉద్దేశించి రాసినదని, తన కీర్తన పండిత పామరులందరు అర్థంచేసుకొని గానం చేయవలసినదన్న ఎఱుక అన్నమయ్యకు ఉండడం చేతనే ఇలా జరిగింది.

అన్నమయ్య పాఠకులు 15వ శతాబ్దం వారు కాబట్టి ఆ వివరణ సరిపోయింది. కాని మన 21వ శతాబ్దిపాఠకులకు మరింత వివరణ అవసరం అని గ్రహించిన పతంజలి గారు ఆధునికమైన ఉదాహరణలతో దానిని మరింత విపులంగా చర్చించారు. భగవద్గీత శ్లోకమూ, దానికి అన్నమాచార్య కుమారుడైన పెదతిరుమలయ్య తెలుగున వ్రాసిన భావము ఇవ్వడంతో బాటు ఆ శ్లోకంచే ప్రేరేపించ

బడిన అన్నమయ్య కీర్తనా, భావ విశేషాలతో బాటు ఇతర విషయాలతో కూడిన వివరణ కూడా ఇచ్చారు.

పారాయణంతో సరిపెట్టక భగవద్గీతను ఆచరణలో పెట్టాలంటే సామాన్యునికి సైతం దానిలో ఉ ఉన్నదేదో తేటతెల్లంగా తెలియాలి. తెలియాలంటే ఆధునిక ధోరణిలో ఓపిగ్గా తెలియ జెప్పే ఈ విధమైన ప్రయత్నాలు అవసరం భావం తెలిసిన తరువాత మరలా మరలా గుర్తుచేసుకోవడానికి వీలుగా పాడుకోవడానికి అన్నమయ్య కీర్తనలు ఎటూ ఉన్నాయి. సంస్కృత శ్లోకం నోటికి రాకపోవచ్చు, కాని తేట తెలుగులో వ్రాసిన బాణీలు తెలిసిన అన్నమయ్య కీర్తనలు పాడుకోవడం అసాధ్యమేమీ కాదు. ఈ ప్రక్రియ ద్వారా భగవద్గీత జన సామాన్యములోకి మరింత గాఢంగా చొచ్చుకుపోయి, మన జీవన విధానంలో, ఆధ్యాత్మిక సరళిలో కొంతైన మార్పు వస్తుందని ఆశిస్తున్నాము.

ఈ ప్రయత్నములో పాలు పంచుకున్న శ్రీయుతులు పతంజలి, సీతారామ శర్మ, చిత్రకారుడు కూచి గార్లకు ధన్యవాదాలు, శుభాకాంక్షలు.

*వరప్రసాద్...*
శాంతా–వసంతా ట్రస్ట్
హైదరాబాద్.

# సమబుద్ధే యిందరికి సర్వవేద సారము
# ఘనుడిందరికి హరి సాధనమో యయ్యా

అందరిని సమదృష్టితో చూడాలి అన్న వేదసారాన్ని అన్నమయ్య తనదైన సరళమైన తెలుగులో ఏ విధమైన ఉపమాన, ఉపమేయాల ప్రమేయం లేకుండా / తీసుకోకుండా చాలా సూటిగా చెప్పారు. ఇలాంటి అనంతమైన, అద్భుతమైన భావాల పదసంపదను మనకు అందించిన మన అన్నమయ్య సర్వదా పూజనీయుడు.

మన జీవితములో జరిగే / ఎదురుపడే / అనుభవించే అన్ని సంఘటనలనూ అక్షర రూపం కల్పించి, తన పదాలను శ్రీవేంకటేశ్వరస్వామి పాదాలకు అర్పించి, మనకు జ్ఞాన పదాలను అందించి జ్ఞాన పథాలను చూపిన వాడు అన్నమయ్య.

అన్నమయ్య కీర్తనలు చదువుతున్నా, వింటున్నా, పాడుతున్నా ఒక అనిర్వచనీయమైన అనుభూతికి లోనౌతాం. ఆయన ఎంచుకొన్నది భక్తి మార్గమైనా, మన సంసార సాగరంలో ఎదురుపడే ఎన్నో సమస్యలను, విషయాలను తన కీర్తనలలో ప్రస్తావించి ముక్తాయింపుగా మనకో దిశానిర్దేశం చేస్తాడు అన్నమయ్య.

భగవద్గీత – భారతీయులకి ఒక ముఖ్యమైన పౌరాణిక గ్రంథం. ఎందుకంటే ఆ గీతని శ్రీకృష్ణ భగవానుడు చెప్పాడనే కాక, అందులో ఉన్న విషయాన్ని బట్టి కూడా "గీత"ని ఒక మహోత్కృష్టమైన గ్రంథంగా భావించి పూజించడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. ఏ వయసువారికైనా, వారి సమస్యలకు ఒక పరిష్కారం చూపుతుంది. ఇప్పుడు వచ్చే ఎన్నో వ్యక్తిత్వ వికాస పుస్తకాలలో మనకి అందిస్తున్న విషయ సారాంశమంతా భగవద్గీత లో మనకి దొరుకుతుంది.

ఈనాడు భగవద్గీత శ్లోకాలు వింటుంటే, 'అయ్యో వీరింట్లో ఎవరో పోయి ఉంటారు' అనే ఉద్దేశ్యం చాలా మందికి కలగడం ఒక దౌర్భాగ్యం. అలాగే ఎవరైనా ఇంట్లో చనిపోయిన వెంటనే భగవద్గీత రికార్డు పెట్టి వినిపిస్తూ ఉంటారు. మనం ఈ లోకం విడిచిపోయే వరకు చదువుతూ, వింటూ మన దశని దిశని మార్చుకొనే అవకాశాన్నిచ్చే భగవద్గీతని వినలేని, కనలేని, చలనంలేని దేహానికి వినిపిస్తే ఫలితం ఏమిటి? చలనంతో ఉన్న మానవుడు, చలనరహిత స్థాయికి చేరుకొనే వరకు ఈ గీతాశ్లోకాలను వింటూ, చదువుతూ, అందులోని నిగూఢ విషయాలని అర్థం చేసుకొని, ఆచరణలో పెడితే, సంసార సాగరంలో మనకి ఎదురయ్యే అనేక సమస్యలకు పరిష్కారం కనబడుతుంది. అందుకేనేమో అన్నమయ్య అనేకానేక గీతాశ్లోకాలలో ఉన్న భావనలని కేవలం ఒక సంకీర్తనలోనే పొందుపరచి అర్థమయ్యే భాషలో మనకందించాడు. అందుకే మిత్రులు డా॥ పతంజలి గారు భగవద్గీతని ఒక వ్యక్తిత్వ వికాస విద్యాలయం అన్నారు.

ఈ భగవద్గీతని భగవంతుడు చెప్పిన విషయాలుగా కాక, ఒక మత గ్రంథంగా కాక, ఒక వ్యక్తిత్వ వికాస సమాచారమున్న పుస్తకంగా చదివి అర్థం చేసుకుంటే, ఒక నూతన ప్రపంచం మన ముందు సాక్షాత్కరిస్తుంది. ఆ ప్రపంచంలో ఎన్నో సమస్యలకి పరిష్కారాలు, మన ఆలోచనా సరళిని మార్చే ఎన్నో విశేషాలు, విషయాలు, మనం ఈ భూమ్మీదికి వచ్చినందుకు ఏం చేయాలి. ఏం చేయకూడదు, ఏది వినాలి, ఏది వినకూడదు.... ఇలా ఎన్నో అద్భుతమైన విషయాల సమాహారం

ఈ భగవద్గీత అటువంటి ఎన్నో విషయ విశేషాలున్న భగవద్గీతలోని సారాన్ని, అన్నమయ్య తన సంకీర్తనలలో మనకి అర్ధమయ్యేలా సరళమైన భాషలో అందించాడు. ఆ మహానుభావుడు అందించిన సంకీర్తనలను, కేవలం ఒక పాటలా కాకుండా అందులో నిగూఢంగా దాగిఉన్న గీతా సారాన్ని గాయక, పాఠక మిత్రులందరికి అందించాలనే ఆశయమే ఈ అన్నమయ్య గీతోపదేశాలు పుస్తకానికి ప్రేరణ.

అన్నమయ్య తన సంకీర్తనలలో గీతాశ్లోకాల సారాంశాన్ని పొందుపరచాడు. ప్రతి శ్లోకాన్ని యథాతథంగా ప్రస్తావించక పోయినా, కొన్ని శ్లోకాల సారాంశ సమాహారాన్ని తన సంకీర్తనలలో మనకందించాడు. ఈ పుస్తకంలో సంకీర్తనకి ఎదురుగా ఇచ్చిన గీతా శ్లోకం ఒక ఉదాహరణ మాత్రమే. వ్యాఖ్యానంలో విపులంగా ఏయే శ్లోకాల స్ఫూర్తితో ఆసంకీర్తన వ్రాసి ఉంటాడో సవివరంగా అందించడం జరిగింది.

అన్నమయ్య కొన్ని గీతాశ్లోకాలని యథాతథంగా కూడా కొన్ని సంకీర్తనలలో ప్రస్తావించాడు. మా మొదటి ప్రయత్నంగా బాగా వాడుకలో ఉన్న, ప్రచారంలో ఉన్న 25 సంకీర్తనలను మేము ఎంచుకోవటం జరిగింది. ఇది మొదటి భాగం అనుకొని, అందరూ ఆశీర్వదిస్తే మరికొన్ని సంకీర్తనలతో రెండవభాగంగా ముందుకు రావాలనే ఆలోచన మాకుంది.

ఇందులో ప్రస్తావించిన అనేక అంశాలకి, అర్ధాలకి తగు ప్రామాణికత ఉందని డా॥ పతంజలి గారు విన్నవించారు. ఇంకా సలహాలు, సందేహాలు ఉంటే మమ్మల్ని సంప్రదించవచ్చు.

మా ఈ ప్రయత్నములో మిత్రులు, పండితులు డా॥ తాడేపల్లి పతంజలి గారు తన వంతు పాత్రని అత్యంత సమర్ధవంతంగా పోషించి, గీతాశ్లోక, అన్నమయ్య సంకీర్తనల సారాంశముతో పాటు, అనేకానేక ఇతర విషయ సంపదని కూడా మనకందించారు. వారికి నా హృదయ పూర్వక ధన్యవాదములు.

మా విన్నపాన్ని మన్నించి మా ఈ పుస్తకానికి తమ ఆశీఃపూర్వక నివేదన, ఆముఖం వ్రాసి ఇచ్చిన పెద్దలు, పండితులు డా॥ సముద్రాల లక్ష్మణయ్య గారికి, ప్రొ॥ లక్ష్మణమూర్తి గారికి, డా॥ పప్పు వేణుగోపాల రావు గారికి నా హృదయ పూర్వక సాష్టాంగ ప్రణామములు.

మా ఈ ప్రయత్నాన్ని ప్రశంసించి, ఈ పుస్తకాన్ని వారి శాంతా – వసంతా ట్రస్టు ద్వారా ప్రచురించడానికి ముందుకు వచ్చిన వదాన్యులు, సంస్కృతీ పోషకులు, హిమవన్నగ వ్యక్తిత్వం కలిగిన డా॥ వరప్రసాద్ రెడ్డి గారికి నా కృతజ్ఞతలు, మనఃపూర్వక ధన్యవాదములు.

ఈ పుస్తకం యొక్క మొదటి రూపం చూసి తన సూచనలను అందించిన పెద్దలు శ్రీ ఎమ్బీ.ఎస్. ప్రసాద్ గారికి ధన్యవాదములు.

మాకు అనుక్షణం సహకారం అందించిన భగద్గీత ప్రచారకులు, మిత్రులు శ్రీ గడ్డమణుగు రామకృష్ణ గారికి ధన్యవాదములు.

ఒక భక్తిగీతం, కీర్తన ఆయా గాయకులు పాడి పూర్తి చేసే లోపు, ఆ కీర్తనలోని సారాంశాన్నంతా తన చిత్రం ద్వారా మన కళ్లముందుంచగలిగే అసామాన్య ప్రతిభ కలిగిన శ్రీ కూచి గారు మా ఈ

పుస్తకానికి చక్కటి భావ వ్యక్తీకరణతో కూడిన ముఖచిత్రాన్ని అందించారు. వారికి నా హృదయ పూర్వక ధన్యవాదములు.

నా ఈ ప్రయాణంలో నాకు అండగా నిలిచిన అన్నమయ్య ఉపాసకుడు, మిత్రుడు శ్రీ జి.బి.శంకరరావు కి, ఎన్నో ఇంటిపనులు మానుకొని తన సమయం మాకు కేటాయించి డి టి పి కార్యక్రమాన్ని నిర్వర్తించిన శ్రీమతి పుట్టా శాంత కుమారి మరియు ముద్రణ ఏర్పాట్లు చూసుకున్న శ్రీ పుట్టా కోటేశ్వరరావుకి నా హృదయపూర్వక ఆశీర్వాదములు.

నాకు జన్మనిచ్చి, సంస్కారవంతునిగా చేసిన నా తల్లిదండ్రులకు నమస్కారములు. నాకు ఎప్పుడూ సహకారాన్నందించే నా సతీమణి సువర్చలకు, నా కుమార్తె చి॥ సాయిసింధు కి ఆశీర్వాదములు.

వీరందరికి ఆ వేంకటేశ్వర స్వామి ఆశీర్వాదం నిరంతరం అందుతూ, ఆయురారోగ్యాలతో వర్ధిల్లాలని ఆ భగవంతుని ప్రార్థిస్తూ మా ఈ పుస్తకాన్ని చదివి ఆనందించగలరని ఆశిస్తూ –

*మహీధర సీతారామ శర్మ*
కార్యదర్శి, సుజనరంజని

| అన్నమయ్య సంకీర్తన | సంబంధించిన ముఖ్యమైన గీతా శ్లోకం |
|---|---|
| 1.అంతయు నీవే హరి పుండరీకాక్ష | అహమాత్మా గుడాకేశ సర్వ భూతాశయ |
| 2.అణురేణు పరిపూర్ణమైనరూపము | నాంతం న మధ్యం న పునస్తవాదిం |
| 3.ఇహ పరసాధన మీతలపు | తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ |
| 4.ఇట్టి నా వెర్రితనములేమని | సర్వస్యాచాహం హృది సన్నివిష్టో |
| 5.ఎంత చదివిన నేమి వినిన తన | అహింసా సత్యమక్రోధ : |
| 6.ఎన్నడు విజ్ఞానమిక నాకు | దు:ఖేష్వనుద్విగ్న మనా: |
| 7.ఏకులజుడేమి యెవ్వడైన నేమి | రాగద్వేష వియుక్తై _స్తు విషయానింద్రి యై |
| 8.ఒకటి సుజ్ఞానము ఒకటి అజ్ఞానము | జ్ఞానేన తు తదజ్ఞానం |
| 9.కడలుడిపి నీరాడగా | శ్రద్ధావాన్ లభతే జ్ఞానం |
| 10.చదివితి దొల్లి కొంత | ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మాన |
| 11.తందనాన ఆహి తందనాన పురె | విద్యావినయ సంపన్నే బ్రాహ్మణ |
| 12.త్రికరణ శుద్ధిగ జేసిన పనులకు | కాయేన మనసా బుద్ధ్యా |
| 13.తెలిసితే మోక్షము | బంధంమోక్షం చ యా వేత్తి |
| 14.దేహి నిత్యుడు | వాసాంసి జీర్ణాని యథా విహాయ |
| 15.నగవులు నిజమని నమ్మేదా | కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన |
| 16.నీవు సర్వ సముడవు | సమోహం సర్వ భూతేషు నమే ద్వేష్యోస్తి |
| 17.పుట్టుభోగులము నేము | యేహి సంస్పర్శజా భోగా దు:ఖయోనయ ఏవ తే |
| 18.పురుషోత్తముడ నీవు | యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ |
| 19.మనుజుడై పుట్టి | అనన్యాశ్చింతయంతో మాం |
| 20.మరి యెందూ గతిలేదు | గతిర్భర్తా ప్రభు: సాక్షీ నివాస: శరణం సుహృత్ |
| 21.మూడే మాటలు | 1.జీవుని స్వరూపం -13-21 |
| 22.వట్టి లంపటాల | యత్తదగ్రే విషమివ |
| 23.విజాతులన్నియు | న జాయతే మ్రియతే |
| 24.శరణ మాతనికే | సర్వ ధర్మాన్ పరిత్యజ్య |
| 25.సమబుద్ధే యిందరికి | సమంపశ్యన్ హి |

## 1. అంతయు నీవే హరి పుండరీకాక్ష

అంతయు నీవే హరి పుండరీకాక్ష
చెంత నాకు నీవే శ్రీరఘురామా

1. కులమును నీవే గోవిందుడా
కలిమియు నీవే కరుణానిధీ
తలపును నీవే ధరణీధరా, నా
నెలవును నీవే నీరజనాభా

2. తనువును నీవే దామోదరా, నా
మనికియు నీవే మధుసూదనా
వినికియు నీవే విట్ఠలుడా, నా
వెనకముందు నీవే విష్ణుదేవుడా

3. పుట్టుగు నీవే పురుషోత్తమా కొన
నట్టనడుము నీవే నారాయణా
యిట్టె శ్రీవేంకటేశ్వరుడా నాకు
నెట్టన గతి యింక నీవేనీవే

(తా.ప.సా.01-385)

**భగవద్గీతా శ్లోకం**

అహమాత్మా గుడాకేశ
సర్వ భూతాశయ స్థితః
అహమాదిశ్చ మధ్యం
చ భూతానామంత ఏవ చ

(గీ.10-20)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

వో అర్జునా! సర్వ భూతాల యొక్క హృదయాలందూన్నూ వున్న వాడ నేను. ఆ భూతాలయొుక్క ఆది మధ్యాంతాలున్నూ నేను.

(పుట-181)

***భావ విశేషాలు :***

ఓ హరీ! హృదయకమలంలో వ్యాపించినవాడా! నా హృదయమే నీ ప్రపంచం. ఆ ప్రపంచంలో అంతా నీవే స్వామీ! నమ్మికొన్నవారి దగ్గరగా ఉండి, ఆనందింపచేసే రామా! నా హృదయానికి దగ్గరగా ఉండి ఆనందమిస్తున్న వాడివి నువ్వే స్వామీ!

1. భూమిని పొందినవాడా గోవిందుడా! బంధువర్గాన్ని పొందించేది కులం. నీ భక్త బంధువులను పొందించిన నా కులం నువ్వే! ఓ దయామూర్తీ! నీ దయతో పెరిగిన నా - రచనా భాగ్యం నువ్వే! భూమిని మోసినవాడా! నా తలపును మోసేవాడివి నువ్వే! బ్రహ్మ స్థానం కలిగిన పద్మం నాభియందు కలిగినవాడా! నేనుండే స్థానం నువ్వే!

2. లీలగా తాటిని (బంధాన్ని) పొట్టపై కట్టుకొన్న దామోదరుడా! బంధాలు కలిగిన ఈ శరీరం నువ్వే! మధువు అనే రాక్షసున్ని హింసించినవాడా! అనేక హింసలతో నిండిన నా జీవితం నువ్వే! ఓ పాండురంగడా! విట్ఠలుడా! నేను వినే ప్రతిమాట నీదే. విశ్వమంతా వ్యాపించిన విష్ణు దేవుడా! నా వెనక, నాముందు - అంతా నువ్వే!

3. పురుషులలో ఉత్తముడా! ఈ ఉత్తమమైన మానవజన్మ నీదే! మానవసమూహం నివాసంగా కలిగిన నారాయణుడా! ప్రాణులకు సృష్టి-స్థితి-లయములు చేసేవాడివి నీవే! పాపాలు తొలగించి ఉత్తమగతులిచ్చే వేంకటేశ్వరుడా! ఇక తప్పకుండా నా గతి నువ్వే! నువ్వే!

'సర్వం ఖల్విదమ్ బ్రహ్మ' అంతా బ్రహ్మమయం - అన్నది ఛాందోగ్య ఉపనిషత్తు. ఉపనిషత్తుల సారమైన భగవద్గీతలో ఈ సృష్టిలోని ప్రతి అంశం తనదేనని, తాను ధరిస్తున్నానని స్వామి చెప్పాడు. (10-42)కవి 'అంతయునీవే' అనటానికి ఇదే ప్రేరకం. విభూతి యోగంలో 'అన్ని ప్రాణుల హృదయాలలో ఉన్న ఆత్మని' తానే అన్నాడు. 'సృష్టి-స్థితి-లయములు చేసేవాడిని తానే' అన్నాడు. (10-20) ఆ వాక్యాలను అన్నమయ్య యథాతథంగా 'కొన, నట్టనడుము నీవే'అన్నాడు.

ఈ ప్రపంచాన్ని బ్రహ్మస్వరూపంగా చూడమన్నది గీత (04-24) అంతటా ఆ బ్రహ్మన్ని చూడమని అన్నమయ్య కూడ ఈ గీతంలో పదే పదే ప్రబోధించాడు. అన్ని ప్రాణుల హృదయాలలో ఉంటాను. నానుండియే స్మృతి, జ్ఞానం, కలుగుతున్నాయని భగవద్గీతలో స్వామి చెప్పాడు (15-15). దీనినే 'దీపింతు దలపు మరపై - దేవుడనేను' అని అన్నమయ్య 'అని యానతిచ్చె' (02-438) కీర్తనలో చెప్పాడు. మంచి విషయాన్ని మళ్లీ మళ్లీ చెప్పాలి కనుక' తలపును నీవే ధరణీధరా'అని ఈ గీతంలో కవి మళ్లీ గీతా సాక్షాత్కారం చేయించాడు.

దామం (=తాడు) ఇంద్రియబంధనానికి ప్రతీక. తమ ఇంద్రియాలను నిగ్రహించుకొన్నవారికి తాను పట్టుబడతానని తెలియజేసే పదం దామోదరుడు. తన శరీరమే దామోదరుడు అని తెలియజేయటం ద్వారా సర్వాంగీణముగా భక్తునికి కావలసిన ఇంద్రియ నిగ్రహాన్ని కవి తెలియజేసినట్లయినది.

మధువనే రాక్షసుడిని సంహరించినవాడు మధుసూదనుడు అనేది భౌతికార్థం. మధువు కర్మవాసనలకు ప్రతీక. ఈ కర్మ వాసనలు క్షయిస్తేనే మోక్షం సాధ్యం. మనికియు (=జీవితం) నీవే మధుసూదన అనటంలో - నా బతుకులోని కర్మ వాసనలు నశింపజేసి మోక్షం ప్రసాదించమనే భక్తుని ఆవేదన ఉంది.

పుండరీకుడనే భక్తుడి మాట విని అతడు తల్లిదండ్రులను సేవించి వచ్చేదాక ఇటుక (విట్) మీద నిలబడి విట్ఠలుడు అయిన విష్ణువును 'వినికియు నీవే విట్ఠలుడా' అని అన్నమయ్య నుతించాడు. ఆర్తితో తనను నుతించేవారి మొరలు వేంకటేశుడు తప్పక వింటాడని కవి ప్రబోధం.

అందరిలోను దేవుడిని చూడటం ఒక గొప్ప యోగ సాధన. ఇలా చూసేవాడు ఒక గొప్ప యోగి అవుతాడు. దైవ సాక్షాత్కారాన్ని పొందుతాడు. గీతలోను - అన్నమయ్య గీతంలోను ఉన్న ఈ ఆధ్యాత్మిక ప్రబోధం ఇప్పటికి అనుసరణీయమే.

అందరిలోను దేవుడిని చూసినవాడు ఇంకొకరికి అన్యాయం చేయలేడు. సాటి మనిషిపై ప్రేమని పెంచుకొంటాడు. చేతనయినంత సేవ ఇతరులకు చేయాలనుకొంటాడు. (గీత.08-05)

ఇలా-అంతయూ నీవే-భావన-మనిషిని-ఉత్తమ వ్యక్తిత్వంతో తీర్చి దిద్దుతుంది. అన్నమయ్య లేఖినిలో రూపుదిద్దుకొన్న ఈ గీతా సారాంశాన్ని మనస్సులో నిరంతరము తలుస్తూ - మంచి తనంలో - ఉత్తమ పథంలో పయనించేవాడు ఆధ్యాత్మికంగా తాను ఎదుగుతాడు. తన జన్మకు సార్థకత కలిగించుకొంటూ - జాతికి బరువుకాకుండా - పరువుగా మారతాడు.

## 2. అణురేణు పరిపూర్ణమైన

అణురేణు పరిపూర్ణమైనరూపము
అణిమాది సిరి అంజనాద్రి మీది రూపము

1. వేదాంత వేత్తలెల్లా వెదకేటి రూపము
ఆదినంత్యములేని యా రూపము
పాదుగ యోగీంద్రులు భావించు రూపము
యీ దెసనిదివో కోనేటి దరి రూపము

2. పాలజలనిధిలోన బవళించే రూపము
కాలపు సూర్య చంద్రాగ్ని గల రూపము
మేలిమి వైకుంఠాన మెరసిన రూపము
కీలైనదిదే శేషగిరి మీది రూపము

3. ముంచిన బ్రహ్మాదులకు మూలమైన రూపము
కొంచని మఱ్రాకు మీది కొనరూపము
మంచి పరబ్రహ్మమై మమ్మునేలిన రూపము
యెంచగ శ్రీవేంకటాద్రినిదే రూపము

(తా.ప.సా. 02-432)

**భగవద్గీతా శ్లోకం**

**నాంతం న మధ్యం** న
పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప

పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం
సమంతాత్ దీప్తానలార్క ద్యుతిమప్రమేయమ్
(గీ. 11-16,17)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

.......వో విశ్వేశ్వరుడవైన విశ్వరూపుడా! నీవు అనంతుడివి గనుక నీకు ఆదిన్నీ, మధ్యమున్నూ, అంతమున్నూ లేదు....... కన్నులకు జూడ శక్యముగాక మండుచున్న అనేక సూర్యులున్నూ, అనేక అగ్నులున్నూ వక్కటిగా కూడినట్టి యెరుగశక్యము గాక యుండెడి నిన్ను పొడ గనుచున్నాడను.
(పుట-200)

***భావ విశేషాలు :***

శ్రీవేంకటేశుని రూపం స్థావరానికి ప్రతీకయైన అణువులోను, జంగమానికి ప్రతీకయైన రేణువులోను చక్కగా నిండియుంది. ఆ రూపం అణిమ మొదలైన అష్టసిద్ధులకు నిలయం.

1. శ్రీవేంకటేశుని రూపం 'అతను (స్వామి) వెదక తగినవాడు' అని ఉపనిషత్తులలో చదువుకొన్న పండితులు - ఏ రూపం కోసం వెదుకుతుంటారో - ఆ రూపం. అది మొదలు, తుది లేనిది. నిలకడగా గొప్ప యోగ సాధన చేసే వారు నిరంతరం - భావించే రూపం. ఇదుగో - ఇక్కడే ఈ పుష్కరిణీ తీరంలో ఆ రూపం ఉంది.

2. శ్రీవేంకటేశుని రూపం పాల సముద్రంలో శయనించిన రూపం. కాలం, సూర్యుడు, చంద్రుడు, అగ్ని తన రూపాలైన రూపం. శ్రేష్ఠమైన వైకుంఠంలో నిలచిన రూపం. వస్తువును సులభంగా దరికి చేర్చే కీలులా - ఒక్కసారి గోవిందా అంటే - నీ కోరికను అతిసులభంగా నెరవేర్చే రూపం.

3. శ్రీవేంకటేశుని రూపం - శ్రేష్ఠులైన (=ముంచిన) బ్రహ్మాదులకు మూలమైన రూపం. తక్కువ కాని మఱ్రాకు మీదఉన్న రూపం. చక్కటి పరబ్రహ్మంగా మమ్మలిని పరిపాలిస్తున్న రూపం.

గీతలోని విశ్వరూప దర్శన యోగంలో ఉన్న 55 శ్లోకాలకు 14 పాదాలలో అన్నమాచార్యుని సంక్షిప్త రూపం అణురేణు రూపంలో కనిపిస్తుంది. అన్ని శ్లోకాలకు అనువాదం లేదు కాని, ముఖ్య శ్లోక శబ్ద భావాలకు, సన్నిహితానుబంధాన్ని అన్నమయ్య ఈ గీతంలో ఏర్పరిచాడు.

నాంతం నమధ్యం..... (11-16శ్లో) ఆదినంత్యములేని రూపమయింది. 'కాలోస్మి' (11-32శ్లో) 'దీప్తానలార్క ద్యుతి ప్రమేయమ్' (11-17శ్లో) ఒక చోటకలిసి కాలపు సూర్య చంద్రాగ్ని గల రూపంగా మారింది. ఇలా గీతా పద బంధాలు అన్నమయ్య గీతంలో  కలిసిపోయాయి.

**'అణురేణు పరిపూర్ణమైన రూపము'** అని అన్నమయ్య. (1408-1503). **'అణు రేణు తృణ కాష్ఠ పరిపూర్ణ గోవింద'** అని పురందరదాసు కీర్తన. (1484-1564) **'అణురేణు యా థోకడా'** అని తుకారాం అభంగం (1568-1650). కాలక్రమాలను పరిశీలిస్తే ఎవరి ప్రభావం ఎవరి మీద ఉన్నదో అర్థమవుతుంది. ఇతరుల మీద ప్రభావం చూపించగల మహాకవి గీత వారసులమైనందుకు మనం  పొంగిపోవాలి.

కుండలినీ యోగ సాధనలో యోగికి ఎనిమిది సిద్ధులు వస్తాయంటారు. శరీరాన్ని అతి చిన్నదిగా చేసే శక్తి అణిమ. శరీరాన్ని అతి పెద్దదిగా చేసే శక్తి  మహిమ. శరీరం బరువు విపరీతంగా పెంచటం గరిమ. శరీరాన్ని అతితేలికగా చేయటం లఘిమ. ఏ వస్తువు కావాలంటే ఆ వస్తువు పొందటం ప్రాప్తి. ఏ భోగం కావాలంటే ఆ భోగం పొందటం ప్రాకామ్యం. ఎక్కడయినా తన అధికారానికి ఎదురులేకుండా చేసుకోవటం ఈశత్వం. అన్నింటిని లోబరుచుకోవటం వశీత్వం.

ఈ అష్టసిద్ధులు స్వామివారి శోభ  అని అన్నమయ్య చెప్పటంలో అష్టసిద్ధుల కంటె స్వామివారి కరుణాసిద్ధి గొప్పదని ఆయన అంతరంగం. ఒక గొప్పవాని రాకవల్ల మన ఇంటికి శోభ వచ్చిందంటాం. ఇప్పుడు ఆలోచిద్దాం. ఇల్లు గొప్పదా? వచ్చిన మనిషి గొప్పవాడా? వచ్చిన మనిషి గొప్పవాడు. ఆలాగే అష్టసిద్ధులకు శోభనిచ్చే వేంకటేశుడు అష్టసిద్ధులకంటె గొప్పవాడు.

**'బ్రహ్మణోప్యాదికర్త్రే'** బ్రహ్మకు మూల కారకుడవు (11-37) అను గీతా ప్రయోగము అనుసరించి **'ముంచిన బ్రహ్మాదులకు మూలమైన రూపము'** అని అన్నమయ్య ఈ గీతంలో ప్రయోగించాడు. ఇక్కడ 'ముంచిన' అంటే శ్రేష్ఠమైన అని సందర్భానుసారంగా చెప్పుకోవాలి. 'ముంచిన నారాయణ మూర్తులే ఈ జగమెల్లా' (ఎదుటనెవ్వరు లేరు కీర్తనలో ) అని ఇంకొకచోట అన్నమయ్య ముంచిన ప్రయోగం. ఇక్కడ కూడ శ్రేష్ఠమైన అను అర్థమే పొసగుతుంది.

ఏ 'పరంబ్రహ్మ' ను తెలుసుకొంటే మానవుడు పరమానందాన్ని పొందుతాడని గీతలో చెప్పబడిందో (13-12) ఆ పరబ్రహ్మను వేంకటేశునిగా, మనలను ఏలేవాడిగా అన్నమయ్య అభివర్ణించాడు.

సిరులు గొప్పవి; వాటికంటే సిరులనిచ్చే వేంకటేశుడు ఇంకా గొప్పవాడు అని భావించినవాడు సిరి కోసం మానవత్వానికి ఉరి వేయడు. ఈ వ్యక్తిత్వ వికాస పాఠం ఈ గీతం ఈ తరానికి నేర్పుతుంది.

## 3. ఇహ పరసాధన మీతలపు

ఇహ పరసాధన మీతలపు
సహజ జ్ఞానికి సత మీతలపు

1. సిరులుముంగిటను జిగి దడబడగా
హరిని మరవనిది యది తలపు
సరిగాంతలెదుట సందడి గొనగా
తిరమయి భ్రమయనిదే తలపు

2. వొడలి వయోమదముప్పతిల్లినను
అడచి మెలంగుట యది తలపు
కడగుచు సుఖ దుఃఖములు ముంచినను
జడియని నామస్మరణమే తలపు

3. మతి సంసారపు మాయ గప్పినను
అతి కాంక్ష జొరనిదది తలపు
గతియై శ్రీవేంకటపతిగాచిన
సతతము నితని శరణమే తలపు

(తా.ప.సా.02-225)

**భగవద్గీతా శ్లోకం**

తస్మాత్ సర్వేషు కాలేషు
మామనుస్మర యుధ్య చ
మయ్యర్పిత మనోబుద్ధిః
మామేవైష్యస్యసంశయమ్

(గీ.08-07)

---

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

అదిగారణాన బట్టుండి సర్వకాల మందున్నూ నన్నే స్మరింపుము. యుద్ధము శేయుము. నీయొక్క మనస్సున్నూ, బుద్ధిన్నీ నా యందే పెట్టితేను నన్నే పొందేవు

(పుట-143)

---

*భావ విశేషాలు :*

తలపు అంటే స్మరణం. దైవాన్ని స్మరించటం ఎంత గొప్పదో, ఏది తలచకూడదో, ఏది తలచాలో అన్నమయ్య ఈ గీతంలో వివరిస్తున్నాడు.

దైవస్మరణ ఈ లోకంలోను, పై లోకంలోను మనలని ఉద్ధరిస్తుంది. అంతట దైవాన్ని చూసే సహజ జ్ఞానికి ఈ దైవస్మరణ ఎవరూ నేర్పక్కర్లేదు. అది అతనికి సహజంగానే వస్తుంది.

1. సంపదలు ఎదుట ప్రకాశిస్తుంటే ఇంద్రియాలు తడబడతాయి. ఆ మైమరపులో హరిని మరిచిపోని ఆలోచనే నిజమైన ఆలోచన. సమాన వయస్సు కలిగిన కాంతల ఎదుట వయస్సు సందడి చేస్తుంటే - భ్రమలకు లోను కాకుండ దైవం మీద స్థిరంగా ఉండేదే నిజమైన ఆలోచన.

2. వయస్సు తెచ్చే మదం - శరీరంలో పుట్టినప్పుడు - హరిని తలచుకొని - అణకువతో ఉండటమే నిజమైన ఆలోచన. సుఖదుఃఖాలు దగ్గరవుతూ, ముంచుతున్నప్పుడు మునిగిన జ్ఞానాన్ని (=వేదాన్ని) పైకి తెచ్చిన హరి తలపే తలపు.

3. మాయ - అంతా నాకు కావాలని - మన బుద్ధిని కప్పివేసినప్పుడు, దాని ప్రభావానికి గురికాకుండా దురాశలకు లోను కాకుండా కాపాడే హరి తలపు రక్షిస్తుంది. ఇక నువ్వే దిక్కని - ఎప్పుడు - శ్రీవేంకటేశుని స్మరించుట మనలని కాపాడుతుంది.

తెలుగు వాడికి ఈ అన్నమయ్య కీర్తన విన్న వెంటనే 'కమలాక్షు నర్చించు కరములు కరములు' అన్న పోతన్న పద్యం వెంటబడి తరుముతుంది. అన్నమయ్య తలపే తలపు అని రెండు సార్లు అనలేదు కాని, భావం అదే. భగవద్గీతలో జ్ఞానవిజ్ఞాన యోగమని ప్రత్యేకంగా ఒక అధ్యాయముంది. మిగతా అధ్యాయాలలో కూడ జ్ఞాన ప్రస్తావన ఉంది. (04-35, 04-38, 04-41, 04-42; 13-07, 13-11; 14-01, 14-02 మొ.) అయితే అన్నమయ్య జ్ఞానికి ముందు 'సహజ' అని విశేషణం చేర్చాడు.

జ్ఞాని అంటే భగవద్గీత ఎల్లప్పుడు పరమాత్మతో కూడి ఉండేవాడు, పరమాత్మ యందే భక్తి కలవాడు అని నిర్వచించింది. (07-17). ఇతనినే అన్నమయ్య సహజ జ్ఞాని అన్నాడు. ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి- వీరిని మించిన వాడు సహజ జ్ఞాని పువ్వుకు తావిలా ఇతనిలో భగవత్సంబంధం ఎప్పుడూ ఉంటుంది కనుక అతడు సహజ జ్ఞాని.

సంపదలు, ఆపదలు దగ్గర సంబంధం కల పదాలు. అర్ధరాత్రి గొడుగు పట్టమనే సంపద స్వామివారికి గొడుగు పడదామనిపించనివ్వదు. ఆ స్థితిలో ఉన్న వారిని హెచ్చరిస్తూ హరిని మరువద్దంటున్నాడు అన్నమయ్య. ఇంత సంపాదిస్తున్నాను, చనిపోయిన తర్వాత నావెంట ఏమి తీసుకొని వెళ్తున్నాను' అనే ఆలోచన ఉన్నవాడు - అధికమైన సిరులను ఉరులుగా భావిస్తాడు. భ్రమ నుంచి బయటపడి 'ప్రమ' ని - నిజమైన జ్ఞానాన్ని - సంపాదించుకోవటానికి ప్రయత్నం మొదలుపెడతాడు. ఆలోచనలో హరిని నిల్పుకొంటాడు.

శరీరంలో రక్తం వేడిగా ప్రయాణించే వయస్సులో, రక్తంతో పాటు మదం కూడ ప్రవహిస్తుంటుంది. అధికారం, డబ్బుతోపాటు ఒంట్లో కొవ్వు పెరుగుతున్నప్పుడు గొంతులో మదం-మాటగా బయటికి వస్తుంది. ఇది తప్పంటున్నాడు అన్నమయ్య. దంభం, దర్పం మొదలైన గుణాలు కలిగినవారిని అసుర సంపద కలిగిన జీవులుగా గీత పేర్కొంది. (16-04) ఆ బంధాన్ని కలిగించే అసుర గుణాన్ని అణుచుకొంటూ హరిని తలవమని కవి బోధ.

దుఃఖం కలిగినప్పుడు స్వామిని తలచుకోవటం సాధారణం. సుఖం కాళ్లను నేల మీద ఉండనీయని స్థితిలో కూడ స్వామి నామాన్ని తల్చుకోవడం వల్ల స్థిర మనస్తత్వం అలవడి వ్యక్తిత్వం వికసిస్తుందని అన్నమయ్య రెండవ చరణంలో చెప్పిన వాక్యాలు దుఃఖేష్వనుద్విగ్న .... (02-56) అను గీతా శ్లోక భాష్యాలు. నా మాయ దాటుటకు శక్యం కాదు. అయినా నన్ను సేవించువారు దాటతారని (07-14) అని స్వామి చెప్పిన వాక్యాలు ఈ కీర్తన చివరి చరణాలుగా మారాయి. పరిధి దాడిన కోరికల రహదారిలో జీవన ప్రయాణం ప్రమాదమని, ఆ తలపే మానుకొమ్మని, స్వామి శరణమే నీ గమ్యమని అన్నమయ్య ప్రవచనం.

సంపదలు తడబాటు కలిగిస్తాయి. కాంత సందడి చేయిస్తుంది. మదం ఉప్పొంగుతుంది. సుఖదుఃఖాలు ముంచుతాయి. మాయ కప్పేస్తుంది. అయినా భయపడకు... శ్రీ హరిని మనస్సులో తలచుకో. శరణు వేడు. అతనే నీ గతి అనుకొన్నావా.... నీ గతి (మార్గం) మారుతుందని, గీతా మార్గంలో అందంగా, బలంగా చెప్పిన అన్నమయ్య భక్తిభావనలను సాహితీ ప్రేమికుల హృదయాలనుంచి కూల్చటం ఎవరితరం?!

## 4. ఇట్టి నా వెఱ్ఱితనము

ఇట్టి నా వెర్రితనములేమని జెప్పకొందును
నెట్టన నిందుకు నగి నీవే దయజూడవే

1. పాటించి నాలోనుండి పలికింతువు నీవు
మాటలాడనేరుతునంటా మరి నే నహంకరింతును
నీటున లోకములెల్లా నీవే యేలుచుండ గాను
గాటాన దొరనంటా గర్వింతు నేను

2. నెమ్మది బ్రజలనెల్లా నీవే పుట్టించగాను
కమ్మి నేనే బిడ్డలగంటినంటా సంతసింతును
నమ్మితి నీవే సర్వ సంపదలు నొసగగాను
యిమ్ముల గడించుకొంటినివి నేనంటా నెంతు

3. మన్నించి యిహపరాలు మరి నీవే యియ్యగాను
యెన్నుకొందునా తపోమహిమయిది యనుచును
వున్నతి శ్రీవేంకటేశ నన్ను నేమి చూచేవు
అన్నిటా నా యాచార్యు విన్నపమే వినవే

(తా.ప.సా.02-304)

**భగవద్గీతా శ్లోకం**

సర్వస్యచాహం హృది సన్నివిష్టో మత్తః
స్మృతిర్ జ్ఞానమపోహనం చ
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాన్తకృద్వేద విదేవ చాహమ్

(గీ.15-15)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

సమస్తమయిన ప్రాణులకున్నూ జ్ఞానమంటెడి స్థలమయిన హృదయ కమలమందు అంతర్యామినై నిలిచి వుండుదును. అటుగనుక నావల్ల అందరికిన్నీ తలపుగలుగును. నావల్లనే యెరుక గలుగుటను, నా వల్లనే జ్ఞానం పుట్టకుండుటను. వేదాల చాతను యెరుగదగిన వాడను నేనే. వేదోక్తమయిన యజ్ఞానుష్ఠానం జేస్తేను నిచ్చెడి వాడను నేనే. యిటు వంటి వేద స్వరూపము యెరిగిన వాడ నేనే.

(పుట-272)

***భావ విశేషాలు :***

శ్రీవేంకటేశా! నా వెఱ్ఱితనములు ఏమని చెప్పుకోమంటావు! ఈ వెఱ్ఱివాడిని చూసి నువ్వు నవ్వుకొన్నా – నాపై దయ చూపించటం నీకు తప్పదు. (ఎందుకంటే నేను నీ భక్తుడినికదా!)

1. నాలోపలనుండి మాటలాడించే వాడివి నువ్వు. కాని నేనే మాట్లాడుతున్నానని నాకు అహంకారం. విలాసాలతో ఈ లోకాలన్నీ పాలించే సిసలైన దొరవు నువ్వు. కాని అధికమైన దొరని నేనని గర్విస్తుంటాను.

2. నిండు మనస్సుతో ఈ ప్రజలందరిని నువ్వు పుట్టించావు. కాని నీ చింత లేకుండా – నిశ్చింతగా – నేనే బిడ్డలను కన్నానని సంతోషిస్తాను. అనుగ్రహించి నువ్వు అన్ని సంపదలు ఇస్తే – ఆయా స్థానాలలో నేనే సంపాదించుకొన్నానని పొంగిపోతాను.

3. ఇహం, పరం నువ్వు నన్ను అనుగ్రహించి ఇస్తే – అది లెక్క పెట్టకుండా – నా తపస్సుతో ఇవన్నీ సాధించుకొన్నానని కిందా మీద అయిపోతాను. ఉన్నతుడవు, ఉన్నతమైన స్థానంలో ఉన్నవాడివి – స్వామీ! నన్ను ఎంతో దయతో చూసావు. ఇకముందు కూడ అలాగే దయ చూడవయ్యా! నా తరపున నీకు ప్రార్థన చేస్తున్న నా గురువు విన్నపాన్ని దయతో విని నా వెఱ్ఱితనాలు క్షమించు.

**'నాహం కర్తా హరిః కర్తా'** నేను దేనికి కర్తను కాను. హరి అన్ని నా చేత చేయిస్తున్నాడు. ఈ రకమైన వినయభావం వైష్ణవులలో బాగా కనిపిస్తుంది. ఇదే అన్నమయ్య ఈ గీతంలో ప్రదర్శించాడు. వెర్రితనమంటే పిచ్చి అని అర్థమే కాదు. అవివేకమనే అర్థం కూడ ఉంది. ఈ అర్థాన్నే ఈ గీతంలో గ్రహించాలి. జీవుడు అజ్ఞానమనే మాయలో ఉన్నంత సేపు 'నేను–నాది–నేనే చేస్తున్నాను' అని విర్రవీగుతాడు. ఈ నేను అనే అహంకారం అంత తేలికగా పోయేది కాదు. అది పోవాలని, పోగొట్టమని స్వామికి జీవుడు చేసే విన్నపం ఈ అన్నమయ్య గీతం.

పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరీ అని నాలుగురకాలైన వాక్కులు. మొదటి మూడు ప్రాణంలోను, మనస్సులోను, ఇంద్రియాలలోను రూపు దాలుస్తాయి. చివరిదైన వైఖరీ వాక్కు భగవంతుని అనుగ్రహంతో మనందరం పైకి మాట్లాడే వాక్కు. ఈ వాక్కులు గీతలో చెప్పినట్లుగా మనలోపల అంతర్యామిగా ఉన్న స్వామి మనచే పలికించేవి (15–15). ఇది తెలుసుకోలేక కొంతమంది మాటలాడనేర్చిన వాడినని గర్వపడుతుంటారు. **'మూకం కరోతి వాచాలం/పంగుం లంఘయతే గిరిమ్'** అని కొంతమంది గీతా ధ్యాన శ్లోకాలలో స్వామిని కీర్తిస్తుంటారు. స్వామి అనుగ్రహం ఉంటే మూగవాడికి కూడ మాటలు వస్తాయి. మాటలకందని ఆ దేవుడు మన చేత మాటలు పలికిస్తున్నాడని భావించి అహంకారం వదిలివేయాలని కవి సందేశం.

శ్రీ వైష్ణవుల విశిష్టాద్వైత సిద్ధాంతంలో ఆచార్యునికి చాలా ప్రముఖమైన స్థానం ఉంది. **'లక్ష్మీనాథ సమారంభం నాథ యమునా మధ్యమాం/అస్మదాచార్య పర్యంతాం వందే గురు పరంపరామ్'** అని ఆచార్య అనుగ్రహానికి వైష్ణవులు చాలా విలువనిస్తారు. అందుకే శ్రీ వైష్ణవుడైన అన్నమయ్య కూడ **'అన్నిటా నా యాచార్య విన్నపమే వినవే'** అన్నాడు. ఆ ఆచార్యుని ద్వారా భగవదనుగ్రహం సులభ సాధ్యం కనుక – అన్నమయ్య ఆచార్యుని విన్నపం వినమని స్వామిని ప్రార్థిస్తున్నాడు. ఆచార్యుని విన్నపం ఏమిటంటే–అన్నమయ్యను రక్షించమని.

**'సమస్త జగత్తు స్వామివలననే పుడుతోం'** దని గీతలో (07–06) చెప్పిన వాక్యాన్నే అన్నమయ్య **'నీవే ప్రజలను పుట్టిస్తున్నావు'** అని అనువదించాడు. **'అన్ని ఫలాలు ఇచ్చేవాడిని నేనే'** (15–15) అని స్వామి చెప్పిన గీతా వాక్యాన్ని **'సమ్మతి నీవే సర్వసంపదలు నొసగగాను'** అని తనదైన శైలిలో చెబుతూ, నేనిదంతా సంపాదించుకొన్నానని మానవుడు విర్రవీగుతాడని అన్నమయ్య బాధపడ్డాడు. ఈ లోకంలో పూలమాలలు మొదలైన విషయ భోగాల మీద, స్వర్గలోకంలో అమృత పానం మొదలైన భోగాలపై ఆశను విడిచిన **తపస్సాధన** – సాధనాచతుష్టయంలో ఒకటి. (నిత్యానిత్య వస్తు వివేకం, శమాది షట్క సంపత్తి, ముముక్షుత్వము మిగతా మూడు). ఇది స్వామి దయ ఉంటే కాని లభించనిది తపోమహిమ. కాని ఈ రకమైన సాధన చేసి, ఇటువంటి గొప్ప వైరాగ్య సాధన 'నేనే చేసాను' అని భావించేవాళ్లను చూసి అన్నమయ్య జాలిపడుతున్నాడు.

అన్నమయ్య గీతంలోని 'నేను' ను మనందరికి సంబంధించిన పదంగా స్వీకరించాలి. వినయం ఆధ్యాత్మికంగాను, లౌకికంగాను – ఉత్తమ ఫలితాలను ఆలస్యంగానయినా ప్రసాదిస్తుంది. తల ఎగరేసిన వాడిని ధూళి కణం నాతో కూడ నువ్వు పోటీపడలేవని పరిహసిస్తుంది. తలదించుకొని వినయం ప్రదర్శించినవాడిని సహనం గల భూమాత నాకంటె అధికుడవని ఆశీర్వదిస్తుంది. ఈ అన్నమయ్య గీతం ఇచ్చే సందేశం ఇదే.

## 5. ఎంత చదివిన నేమి వినిన

ఎంత చదివిన నేమి వినిన తన
చింత యేల మాను సిరులేల కలుగు

1. ఇతర దూషణములు యెడసిన గాక
అతికాముకుడు గానియప్పుడు గాక
మతి చంచలము గొంత మానినగాక
గతి యేల కలుగు దుర్గతులేల మాను

2. పర ధనముల యాస పాసిన గాక
అరిది నిందలు లేనియప్పుడు గాక
విరస వర్తనము విడిచిన గాక
పరమేల కలుగు నాపదలేల మాను

3. వేంకటపతి నాత్మ వెదకిన గాక
కింక మనసున తొలగిన గాక
బొంకుమాటలెడసి పోయిన గాక
శంక యేల మాను జయమేల కలుగు

(తా.ప.సా.01-62)

**భగవద్గీతా శ్లోకం**

అహింసా సత్యమక్రోధః త్యాగః శాన్తి రపైశునమ్
దయాభూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్
(గీ.16-2)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

పరుల పీడింపకుండుటను, సత్యమే పలుకుటను, వకరికి బాధకమైన కోపం మానుట, ఆత్మజ్ఞానానకు విరోధమైన వస్తువులు విడుచుటను, ఇంద్రియాలు విషయాలయందు బారకుండుటను, అణచి శాంతిబొందించు టను, వకరి మీద కొండెం చెప్పకుండుటను, యే ప్రాణులు దుఃఖపడినను జూచి దయ తలచుటను, విషయాలందు లోలుడు గాకుండుటను, సాధువులు తన్నుజూచి సంతోషించుకుంటూన్ను తిరుగుటను, శ్రీ (స్త్రీ)లు దగ్గెర వుండినను చంచల పడకుండుటను....

(పుట-277)

***భావ విశేషాలు :***

ఏమి చేయాలో తెలియక బాధపడుతున్న జీవుడిని అన్నమయ్య ఈ కీర్తనలో ఓదార్చి దారి చూపిస్తున్నాడు.

చదివినంత మాత్రాన, విన్నంత మాత్రాన అది కావాలి - ఇది కావాలి అనే నీ చింత పోదు. నీకు భగవద్గీతలో చెప్పిన దైవీసంపద రాదు.

1. ముందు నీ ప్రవర్తనలో మార్పు తెచ్చుకో. ఇతరులతో దూషణ వాక్యాలు మానేయ్! కోరిక ఉండటంలో తప్పులేదు. అతి కోరికలు వదిలేయ్! చంచలత్వం ఆలోచనల్లో కొంతయినా వదలటానికి ప్రయత్నించు. అలా నీ ప్రవర్తనని మార్చుకోపోతే నీకు అతీగతీ లేదు. నీ బతుకంతా నరకమే (దుర్గతి).

2. ఇతరుల ధనం మీద ఆశ పడకు. భరించటానికి వీల్లేని (=అరిది) నిందలు ఇతరుల మీద వేయకు. ఆవిధంగా నీ నడత ఉండకూడదు. ఎప్పుడూ తగాదాలాడే మనస్తత్వం వదిలేయ్! ఈ విధంగా ఉండకపోయావో- నీకు మోక్షం రాదు. ఆపదలు పోవు.

3. శ్రీవేంకటేశ్వరుడిని ఆత్మలో తెలుసుకో! కోపాన్ని మనస్సులో పోగొట్టుకో. అబద్ధాలాడటం మానేయ్! ఇలా చేయకపోయావో నీకు జన్మ జన్మలనుంచి వస్తున్న సందేహాలు తొలగిపోవు. జయం కలగదు.

జ్ఞానం - విజ్ఞానం ఈ రెండు పదాలు మనం వింటుంటాం. పరమాత్మను చేరుటకు కావలసిన నైతిక ఆధ్యాత్మిక సంపదను జ్ఞానం అంటారు. అనుభవ సహితమైన జ్ఞానం-విజ్ఞానం. (పరబ్రహ్మం)

'ఎవరిని వాళ్లే ఉద్ధరించుకోవాలి' అని గీతలో చెప్పిన మాట అందరికి తెలుసు. అన్నమయ్య ఎంత గొప్పవాడంటే - తను ఉద్ధరించబడటమే కాదు. విజ్ఞాన యుతులైన తోటి మానవులని ఉద్ధరించాలనుకొని అద్భుతమైన కీర్తనలు రాసాడు. అట్నుంచి నరుక్కురమ్మన్నట్లుగా- విజ్ఞానంనుంచి జ్ఞానం వైపు ఎలా ఎదగాలో ఈ చదువు కీర్తనలో క్రమంగా వ్యక్తీకరించాడు.

మనస్సు చేత, వాక్కు చేత, శరీరం చేత - ఎవరినీ బాధ పెట్టకుండా ఉండటం అహింస. ఇది గీతలో చెప్పిన 26 మంచి లక్షణాలలో ఒకటి. శ్లోకంలో మొదట చెప్పిన పదాన్ని అన్నమయ్య మొదటగా పేర్కొన్నాడు. ఇతరులను దూషించటం వాక్కు ద్వారా హింసించటం కనుక దూషణాలు పనికిరావని కవి మాట. జ్ఞాన సాధనలో ఇది మొదటి అడుగు. ఉత్తమ వ్యక్తిత్వ సాధనా దశలో మొదటి అడుగు. అందుకే మళ్లీ రెండవసారికూడ ఇదే గీతంలో నిందలు వేయకంటూ పునరుక్తి చేసాడు.

దేవునికి సంబంధించిన మంచి గుణాలను దైవీసంపద అంటారు. ఈ దైవీసంపదనే అన్నమయ్య సిరులేల కలుగు అంటూ ఈ కీర్తనలో ప్రస్తావించాడు. నీ ప్రవర్తనలో గీతలో చెప్పిన దైవీసంపద లక్ష ణాలను అలవర్చుకోపోతే నీకు జ్ఞానప్రాప్తి సాధ్యంకాదని కవి హెచ్చరిక.

'ఎంత చదివిన నేమి వినిన' అనే అన్నమయ్య ఎత్తుగడ ప్రభావంతో 'ఎంత చదువు చదివి ఎన్నియో విన్నను/హీనుడవగుణంబు మానలేడు/బొగ్గు బాల గడుగ బోవునే నైల్యంబు' అంటూ వేమన్న పద్యాన్ని రాసాడు. అన్నమయ్య ప్రభావం పడినవారు సామాన్యుడైనా - అసామాన్యుడైనా- అంత తేలిగ్గా ఆయన్నుంచి తప్పించుకోలేరు.

'అచాపలమ్' అని గీతలో ఉన్నదాన్ని అన్నమయ్య **'మతి చంచలము కొంత మానిన గాక'** అని వివరించాడు. పెద తిరుమలయ్య స్త్రీ(శ్రీ)లు దగ్గర ఉన్నా చంచలపడకుండుట అని అనువదించాడు. ఇక్కడ మనమొక విషయం గుర్తుంచుకోవాలి. 'నేను గీతను ఉన్నదున్నట్టు అనువదిస్తున్నాను' అని అన్నమయ్య ప్రకటించలేదు. కాని పెద తిరుమలయ్య రామానుజ భాష్యానుసారంగా గీతని అనువదిస్తున్నానని ప్రతి అధ్యాయం చివర్లో చెప్పాడు. అందువల్ల 'అయ్యది' స్వేచ్ఛానువాదం. పెద తిరుమలయ్యది భావానువాదంగా మనం గ్రహించాలి.

చంచలత్వం కొంత మానటం అంటే -చంచలత్వం మానటానికి - ప్రయత్నం మొదలు పెట్టమని ఆర్థంగా గ్రహించాలి. ఆ - కొంత - కొంతకాలానికి - సంపూర్ణత్వంగా మారుతుంది. ఆధునిక కాలంలో కూడ జీవన వైద్యులు - ఇలాగే సలహా ఇస్తున్నారు. ఉన్నట్టుండి ఒక అలవాటు మానటం కష్టం. నెమ్మది నెమ్మదిగా దాన్ని తొలగించుకోవాలి. కోరిక ఉండటంలో తప్పులేదు. అతికాముకత ఉండకూడదని అన్నమయ్య ఈ పాటలో చెప్పటంలో కూడ ఇదే ఉద్దేశ్యం.

అన్నమయ్య ఈ గీతంలో చదువులను నిరసించలేదు. చదువుల సారమైన వేంకటేశ్వరుని ఆత్మలో దర్శించే జ్ఞానం అలవరుచుకోవటానికి ప్రయత్నించమంటున్నాడు.

## 6. ఎన్నడు విజ్ఞానమిక

ఎన్నడు విజ్ఞానమిక నాకు
విన్నపమిదె శ్రీవేంకట నాథా

1. పాసిన బాయవు బంధములు
ఆస దేహమున్ననాళ్లు
కోసిన తొలగవు కోరికలు
గాసిలి చిత్తము గలిగిన్నాళ్లు

2. కొచ్చిన గొరయవు కోపములు
గచ్చుల గుణములు గలనాళ్లు
తచ్చిన తలగవు తహతహలు
రచ్చల విషయపు రతులన్నాళ్లు

3. వొకటి కొకటికిని వొడబడవు
అకట శ్రీవేంకటాధిపుడ
సకలము నీవే శరణంటే యిక
వికటములణగెను వేడుక నాళ్లు

(తా.ప.సా.04-343)

**భగవద్గీతా శ్లోకం**

దుఃఖేష్వనుద్విగ్న మనాః
సుఖేషు విగత స్పృహః
వీత రాగ భయక్రోధః
స్థిత ధీర్మునిరుచ్యతే

(గీ.2-56)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

దుఃఖాలు వచ్చినప్పుడు మనస్సు దిగబడక, సుఖాలందు ఆశపడక, ఆ సుఖాల నిమిత్తమై వేడుక, భయము, క్రోధము విడిచిన విచార పరుడు స్థితధీ అనిపించుకొనును.

(పుట-46)

*భావ విశేషాలు :*

స్వామీ! నాకు తొందరగా విజ్ఞానం కలిగించవయ్యా! నేను నీకు విన్నపం చేస్తున్నాను.

1. ఆశలతో ఈ శరీరం ఉన్నన్నాళ్లు  ఈ బంధాలు నన్ను విడవవు. అసంతృప్తితో, బాధతో నా మనస్సు ఉన్నంత కాలం - నా కోరికలు ఎంత ఖండించినా మళ్లీ మొలుస్తునే ఉంటాయి.

2. గచ్చుల గుణ స్వభావాలు కలిగిన వాళ్లు ఇంకొకళ్లు చెప్పే విషయం తమలోకి జొరబడటానికి వీల్లేనంతగా గట్టి స్వభావం కలిగి ఉంటారు. ఇలాంటి వాడి దగ్గరికి వెళ్లి - ఇలా చేస్తే కోపం తగ్గుతుంది-ఆలా చేస్తే కోపం తగ్గుతుంది - లాంటి మంచి విషయాలు చెప్పినా వాడిలో శాంత గుణం పుట్టదు. వాడిలో కోపం పోదు. కొంతమందికి విషయాన్ని రచ్చ చేసే తత్త్వం ఉంటుంది. అవసరం లేని - ఊళ్లో జరిగే ప్రతి విషయంతనకు కావాలి. ఇలా తన మనస్సును రచ్చబండగా మార్చుకొంటాడు. ఈ పనికి మాలిన రచ్చబండ విషయాల మీద ఆసక్తులున్నంత కాలం  -మనస్సును దైవ నామంతో మథించాలనే తహతహలు కలగవు. (తహతహలు దైవం మీద, దైవ విషయాల మీద ఉండాలి కాని  పనికి మాలిన తగాదా విషయాల మీద ఉండకూడదని భావం)

3. శ్రీవేంకటేశ్వరా! ఈ ఇంద్రియాలున్నవి చూసావా! ఒకదానికొకటి పడదు. చూడద్దని మనస్సు చెబితే కన్ను చూస్తానంటుంది. పురాణాన్ని వినమని మనస్సు చెబితే చెవులు ఇంకేదో వినాలంటాయి. ఈ ఇంద్రియాలలో ఒకదానికొకటి పడటం లేదు. నీకు శరణమని, ఆ ప్రకారంగా నడిస్తే - ఆ ఇంద్రియాలన్నీ నియంత్రణలోకి వస్తాయి. వికటత్వాలన్నీ అణగిపోయి, నిజమైన బ్రహ్మానందం లభిస్తుంది.

అనుభవ సహితమైన జ్ఞానం - విజ్ఞానం. (గీత7-1) దీనినే పరబ్రహ్మమంటారని శ్రీ విద్యాప్రకాశానంద గిరి స్వామి చెప్పారు. (గీతా మకరందం.557పే.) ఇటువంటి విజ్ఞానానికై - పర బ్రహ్మ జ్ఞానానికై - జీవుని ఆవేదన అన్నమయ్య ఈ గీతంలో ఆవిష్కరించారు.

అన్నమయ్య ఈ గీతంలో వేంకటేశ్వరునికి శరణు అనటం లేదు. శ్రీవేంకటేశ్వరుని (లక్ష్మీ దేవితో కూడుకొన్న వేంకటేశ్వరుని) శరణు కోరుకొమ్మంటున్నాడు. దీని వెనకాల ఒక కారణముంది. అమ్మని ప్రార్థించిన తర్వాతనే అయ్యని ప్రార్థించాలి. పద్ధతి ప్రకారం విష్ణు సహస్ర నామం -ఒక్కటి విడిగా చదవటానికి వీల్లేదు. భగవద్రామానుజాచార్యులవారు లక్ష్మీదేవి గురించి రాసిన శరణాగతిగద్య, లక్ష్మీ అష్టోత్తర స్తోత్రం చదివిన పిదప విష్ణు సహస్ర నామం చదవాలని, అప్పుడే అది పూర్ణ ఫలితాన్ని ఇస్తుందని పెద్దలు చెబుతారు. అయ్య దయ కావాలంటే ముందు అమ్మ ని శరణువేడాలి. అందుకే అన్నమయ్య శ్రీవేంకటేశ్వర అన్నాడు. రామదాసులాంటి మహానుభావులు కూడ ఈ బాటలోనే నను బ్రోవమని చెప్పవే అని అయ్యకు చెప్పమని అమ్మకు విన్నవించుకొన్నారు.

ఆశా సాగరుడనే సంసారి దగ్గరికి ఒకసారి గాలవుడనే మహర్షి వచ్చాడు. 'ఎంతకాలం ఈ సంసారంలో ఆశాబంధాలతో కొట్టుమిట్టాడతావ్! నాతో రా! మోక్షం వచ్చే మార్గం చెబుతా' నన్నాడు. పిల్లలమీది ప్రేమతో 15 సంవత్సరాల తర్వాత రమ్మన్నాడు ఆశా సాగరుడు. 15 సంవత్సరాల తర్వాత వచ్చిన గాలవుడికి కొట్టుమీద సరుకులు అమ్ముతున్న ఆశా సాగరుడు కనిపించాడు. తనతో రమ్మన్నాడు గాలవుడు. పిల్లలకి కొంత కూడబెట్టాలి. 20సంవత్సరాల తర్వాత రమ్మన్నాడు ఆశా సాగరుడు. 20సంవత్సరాల తర్వాత వచ్చిన గాలవుడికి చనిపోయి ఎద్దుజన్మలో ఉన్న ఆశా సాగరుడు కన్పించాడు. కొడుకులు వ్యవసాయంలో ఆ ఎద్దును వాడుకొంటూ కొడుతున్నారు. మళ్లీ తనతో రమ్మన్నాడు గాలవుడు. పిల్లలకి సాయం చేయాలి కదా! అన్నాడు ఆశాసాగరుడు. తర్వాత కుక్క జన్మలో తన ఇంటికి కాపలా కాస్తూ గాలవుడికి కనిపించాడు ఆశాసాగరుడు. గాలవుడు రమ్మని పిలిచినా వెళ్లలేదు. తర్వాత జన్మలో పాముగా మారి తన ఇంటిలో భూమిలో దాచిన నిధినిక్షేపాలకు కాపలా కాస్తూ కనిపించాడు గాలవుడికి. గాలవుడి వెంట వెళ్లటానికి ఒప్పుకోలేదు. ఇక కథకి ముగింపు చెప్పాలనుకొన్నాడు గాలవుడు. పామును చంపితే నిధి స్వంతం అవుతుందని ఆశాసాగరుని కొడుకులకు చెప్పాడు గాలవుడు. ఆ మాట ప్రకారమే కొడుకులు నిధికోసం పాము రూపంలో ఉన్న తమ తండ్రిని చంపారు. అప్పటికి బంధాలనుంచి, ఆశలనుంచి గుణ పాఠం నేర్చుకొన్న ఆశాసాగరుడు -గాలవుడి వెంట బయలుదేరాడని ఒక పురాణ కథ. ఆశతో దేహము ఉన్నన్నాళ్లు బంధాలు తొలగిపోవని అన్నమయ్య అందుకే నొక్కి చెప్పాడు.

'ఇంద్రియాలు ఒకదాని మాట ఒకటి వినవు' - అంటూనే స్వామిని శరణు వేడితే ఇవన్నీ తొలగిపోతాయని గీతలో చెప్పిన మాటను (07-14) అన్నమయ్య పునరుక్తి చేసాడు. ఆ మాటని పాటించి కృతార్థులమవుదాం.

## 7. ఏ కులజుడేమి యెవ్వడైన నేమి

ఏకులజుడేమి యెవ్వడైన నేమి
ఆకడ నాతడె హరి నెరిగినవాడు

1. పరగిన సత్య సంపన్నుడైన వాడే
పరనింద సేయ దత్పరుడు గానివాడు
అరుదైన భూత దయానిధి యగువాడే
పరులు దానే యని భావించువాడు

2. నిర్మలుడై యాత్మ నియతి గలుగువాడే
ధర్మ తత్పరబుద్ధి దగిలినవాడు
కర్మ మార్గములు గడవనివాడే
మర్మమై హరి భక్తి మరవనివాడు

3. జగతిపై హితముగా చరియించువాడే
పగలేక మతిలోన బ్రదికిన వాడు
తెగి సకలము నాత్మ తెలిసిన వాడే
తగిలి వేంకటేశు దాసుడైన వాడు

(తా.ప.సా.01-292)

**భగవద్గీతా శ్లోకం**

రాగద్వేష వియుక్తై స్తు
విషయానింద్రి యై శ్చరన్
ఆత్మ వశ్యై ర్విధేయాత్మా
ప్రసాద మధిగచ్ఛతి

(గీ.2-64)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

అటుగాక నన్నాశ్రయిస్తేను, రాగ ద్వేష వియుక్తులై, తనకు వశమైన యింద్రియాల చాతనూ విషయాల నుభవిస్తున్నా, తన మనస్సు తనకు వశం చేసికొనెనా, ఆ మనస్సు తనకు ప్రసన్నమౌను.

(పుట-49)

***భావ విశేషాలు :***

భగవద్గీత రెండవ అధ్యాయం సాంఖ్య యోగంలో చెప్పిన స్థిత ప్రజ్ఞుని లక్షణాలలో కొన్నింటిని అన్నమయ్య ఈ గీతంలో ఆవిష్కరిస్తున్నాడు.

ప్రతివాడికి కళ్లు మూత పడే 'కడ' – చిట్టచివరి పరిస్థితి వస్తుంది. ఆ సమయంలో (=ఆ కడ) హరిని తలుచుకొన్నవాడు – ఎవడైనా – ఏ కులంలో పుట్టిన వాడయినా – హరిలో లీనమవుతాడు. అతడే హరిని సంపూర్ణంగా తెలిసికొన్నవాడవుతాడు. అలా చిట్టచివరి స్థితిలో హరిని దర్శించాలంటే అతనికి ఈ లక్షణాలు జీవితంలో మొదటినుంచి ఉండాలి.

01. ఎప్పుడూ సత్యం మాట్లాడాలి. పరనింద చేయకూడదు. సర్వ భూతాల మీద దయ కలిగి ఉండాలి. ఇతరులను తానే అని భావించాలి.

02. స్వచ్ఛమైన మనస్సు కలిగి ఉండాలి. ఇంద్రియ నిగ్రహం, ధర్మ తత్పరమైన బుద్ధి కలిగి కర్మ మార్గాలు అనుష్ఠిస్తూ, హరి భక్తిని జీవితాంతం మరిచిపోకుండా ఉండాలి.

03. ఎప్పుడు ప్రపంచానికి మేలు చేయాలి. ఎవరి మీద పగ ఉండకూడదు. సాహసంతో అంతా ఆత్మ అని తెలుసుకోవాలి. ఆసక్తితో వేంకటేశునికి దాసుడు కావాలి.

మరణం కొన్ని క్షణాల్లో మనిషిని సమీపిస్తున్నప్పుడు చూస్తున్న కళ్లు చూసే శక్తిని కోల్పోతాయి. వినే చెవులకు ఆ శక్తి నశిస్తుంది. ఏదో చెప్పాలనే ఆరాటంతో ఉన్న గొంతు మూగపోతుంది. తను లోకంనుంచి శాశ్వతంగా దూరమవుతున్నాననే భయంతో మనిషి గజగజా వణికి పోతాడు. ఆ సమయంలో హరిని తలుచుకోవటం వల్ల మోక్షం లభిస్తుంది. (గీత–02–72) కాని ఆ మరణ సమయంలో హరి స్మరణ అంత తేలికయిన విషయం కాదు. అది సామాన్యులకు అన్నమయ్య సాధ్యం చేయాలనుకొన్నాడు. అంత్య కాలంలో హరి స్మరణ భాగ్యం రావాలంటే కొన్ని మంచి లక్షణాలు ఉండాలని, జీవితాంతం వాటిని ఆచరించమని ఈ గీతంలోని మూడు చరణాల్లో ప్రబోధించాడు.

ఏకులం వాడయినా హరిని పొందవచ్చునని అన్నమయ్య తీర్పు. హరికటాక్షానికి కులమతాల పట్టింపులు లేవని ఏ కులజుడేమి అంటూ గొంతెత్తి చాటాడు. రామానుజాచార్యులవారు దేవాలయం మీదికెక్కి అందరికి తెలియాలని – అందరి మేలుకోసం – మంత్రాన్ని బిగ్గరగా చదివారు. అలాగే అన్నమయ్య – 'హరిని ఎవరైన కొలవవచ్చు. కుల మతాల అడ్డుగోడలు హరికి – భక్తునికి మధ్య లేవని – అంటూ – అందరి క్షేమాన్ని ఆకాంక్షిస్తూ గొంతెత్తి చాటాడు.. కర్మ మార్గాలు అనుష్ఠించాలనే అన్నమయ్య మాట 'యజ్ఞార్థ....' (గీత–03–09) అను గీతా శ్లోకం నుంచి పుట్టింది. దేవుని కోసం చేసే ఏ కర్మ కూడ ఈ లోకంలో బంధాలు కల్గించదు. మిగతా కర్మలన్నీ కర్మ బంధాలు కలిగిస్తాయి. కనుక దైవానికి సంబంధించి చేసే పనులు ఆచరించాలని ఉపదేశం.

ఆత్మను తెలుసుకోవటం సాహసం అని మూడవ చరణంలో అన్నాడు కవి. సాహసం అంటే కత్తి పట్టుకొని యుద్ధంచేయటం, వీరత్వం చూపించటం మాత్రమే కాదు. మంచిగా బతకటం ఈ లోకంలో సాహసం. అందరిలోను భగవంతుని దర్శించటం సాహసం. పగ అనే గుణం లేకుండా ఉండటం సాహసం. అందుకే 'ఆత్మ వశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి' అనే వాక్యాన్ని పెద తిరుమలయ్య 'తన మనస్సు తనకు వశం చేసికొనెనా, ఆ మనస్సు తనకు ప్రసన్నమౌను' అని అద్భుతంగా తండ్రి అంతరంగాన్ని వివరించాడు.

హరి అనే మాటకి అర్థాన్ని విష్ణు మూర్తి స్వయంగా ఇలా చెప్పాడు.

హరామ్యఘం చస్మ ర్తృణాం హవిర్భాగం క్రతుష్వహం / వర్ణశ్చ మే హరిర్వేతి తస్మా ద్ధరి రహం స్మృతః (స్మరించే వారి పాపాలను. యజ్ఞాలలో హవిర్భాగాలను తీసుకోవటం చేత, నా శరీర వర్ణాన్ని బట్టి నన్ను హరి అంటారు(భార.శాంతి). ఆ హరి భక్తిని ఆసక్తితో పెంచుకొమ్మని అన్నమయ్య ప్రబోధం.

ఈ గీతంలో అన్నమయ్య చెప్పిన **'ఇతరులనుతానే అని భావించటం'** (ఆత్మవత్సర్వభూతాని) ఉత్తమోత్తమమైన లక్షణం.ఈ ఒక్క లక్షణాన్ని ప్రతి ఒక్కరు అలవరుచుకొంటే సమాజం తప్పక బాగుపడుతుంది. అన్ని ప్రాణులను తనలా సమానంగా చూసేవాడు. ఇతరుల సుఖ దుఃఖాలను తన సుఖ దుఃఖాలుగా భావించే యోగి పరమ శ్రేష్ఠుడను గీతా శ్లోకానికి (06–32) ఒక్క వాక్యంలో అందమైన అనువాదం అన్నమయ్యది. ఇతరులేవి చేస్తే తన మనస్సుకు బాధ కలుగుతుందో, అవి ఇతరులకు చేయకూడదని సమాజ హితాన్ని కాంక్షించింది మహాభారతం. (ఒరులేయవి యొనరించిన) ఆ బాటలోనే 'జగతిపై హితముగా చరియించు' మని చెప్పిన అన్నమాచార్యుని గీత శిరోధార్యం.

## 8. ఒకటి సుజ్ఞానము

ఒకటి సుజ్ఞానము ఒకటి అజ్ఞానము
ప్రకటించి వొకటి చేపట్టరో వివేకులు

1. తను దలచుకొంటేను తక్కిన దేహ భోగాలు
పనికిరావు అవి ప్రకృతిగాన
ఘనమైన లోక భోగములతో లోలుడైతే
తనుగానరాదు జీవ తత్త్వముగాన

2. దైవమునెరిగితేను తన కామ్య కర్మములు
భావించి మరవవలె బంధాలు గాన
కావించేటి తన కామ్యకర్మాల గట్టువడితే
దైవము లోను గాడు స్వతంత్రుడు గాన

3. సరి మోక్షముగోరితే స్వర్గము తెరువుగాదు
అరయ స్వర్గముతెరువల మోక్షానకు
పరగ నలమేల్మంగపతి శ్రీవేంకటేశుని
శరణాగతియె సర్వ సాధనముగాన

(తా.ప.సా.02-357)

**భగవద్గీతా శ్లోకం**

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం
నాశితమాత్మనః
తేషామాదిత్యవద్ జ్ఞానం
ప్రకాశయతి తత్పరం

(గీ. 05-16)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

యెవ్వరైనా నేమి సంతతమున్న అభ్యసింపబడిన జ్ఞానము చాతను తమ అజ్ఞానం నశింపజేయుదురు. వారికి ఆ తరువాతను ఆదిత్యునివలెనె జ్ఞానం ప్రకాశించును.

(పుట-98)

***భావ విశేషాలు :***

ఒకటి మంచిదైన జ్ఞానం. ఇంకొకటి మంచిది కాని జ్ఞానం. వివేకమున్న వాళ్లు రెండింటిలో ఒకదానిని - తాము దేనిని గ్రహిస్తున్నారో లోకానికి ప్రకటించి - గ్రహించండి.

1. తనని-అంటే-భగవంతుని తలచుకొంటే-అన్నింటిలోను ఆయనని చూస్తూ ఉంటే ఆ భోగం ముందు-మిగిలిన తాత్కాలికమైన శరీర భోగాలు పనికిరావనిపిస్తాయి. ఎందుకంటే-ఆ శరీర భోగాలు-అపరా ప్రకృతి కనుక. మాయతో గొప్పగా అనిపించే లోకంలోని భోగాలయందు ఆసక్తిని పెంచుకొంటే-తను-ఆ దైవాంశ-నీకు కనబడడు. ఎందుకంటే అతను జీవ తత్త్వం కనుక. (అన్నింటిలో స్వామిని చూడటం సుజ్ఞానం. లౌకిక భోగాలలో మనస్సు పెట్టడం అజ్ఞానం అని భావం)

2. సన్న్యాసిగా మారి-ఫలం కోరి చేసే కర్మలను (కామ్య కర్మలను)-మోక్షానికి అడ్డంకులని భావించి-వాటిని చేయటం మరిచిపోవాలి. ఎందుకంటే అవి బంధాలు పెంచుతాయి కనుక. ఇది సుజ్ఞానం. ఆలా కాకుండా అజ్ఞానంతో కామ్య కర్మల బంధంలో చిక్కుపడితే-బంధంలేని స్వతంత్రుడైన దేవుడిని వశం చేసుకోలేవు.

3. సరిలేని మోక్షాన్ని కోరుకొంటే-స్వర్గం నీ మార్గం కాదు. మోక్షాన్ని కోరుకొనేవాడు స్వర్గాన్ని కోరుకోవటం అజ్ఞానం. ఎందుకంటే స్వర్గం వెళ్లినా-మళ్లీ అక్కడ మోక్షానికి మార్గం వేసుకోవాలి. కాబట్టి అలమేల్మంగభర్త శ్రీవేంకటేశ్వరుడిని శరణు కోరటం అన్నింటిని నీకు కలిగిస్తుంది. ఇది సుజ్ఞానం.

జ్ఞాన ప్రతిబంధ త్రయమని ఒక మాట ఉంది. అంటే జ్ఞానాన్ని మూడు విషయాలు అడ్డగిస్తూ అజ్ఞానంలో పడేస్తుంటాయి. ఆ మూడింటిని అన్నమయ్య తన మూడు చరణాలలో నిరూపించి వాటి నివారణోపాయాలు చెప్పాడు.

*1. సంశయం :* 'కలడు కలండనెడువాడు కలడో లేడో అనే సంశయంతో – 'ఉన్న దేహాన్ని, వయస్సును వ్యర్థం చేసుకోవటం దేనికి? చక్కగా దేహ భోగాలు అనుభవిస్తే సరిపోతుంది. పోయిన వయస్సు మళ్లా రాదు' అని అష్ట భోగాలు – (అన్నం, వస్త్రం, గంధం, పుష్పం, శయ్య, తాంబూలం, స్త్రీ, గానం) అనుభవించాలని కొంతమంది మనస్సు ఉవ్విళ్లూరుతుంది. ఇది జీవుడి తప్పు కూడ కాదు. అజ్ఞాన ప్రకృతి ఈ పని చేయిస్తుంటుంది. ఈ సంశయం తొలగటానికి ఒక ఉపాయం ఉంది. అది స్వామివారిని కీర్తనాదులద్వారా శ్రవణం చేయటం. దీనినే అన్నమయ్య 'తను తలుచుకొంటేను' అన్నాడు. భోగాలకు లోను కాకుండా ప్రయత్న పూర్వకంగా ఆయనని తలుచుకొంటుంటే జీవితాన్ని తప్పక ప్రతివాడు గెలుచుకొంటాడు. భోగమంటే పాము పడగ అని ఇంకో అర్థం ఉంది. పడగ మెత్తగా ఉందని స్పర్శ సుఖం అనుభవించాలని మొదలుపెడితే కాటుకు గురికాక తప్పదు. ఇది మరిచిపోకూడదు.

*2. అసంభావన :* ఫలం కోరి చేసే శుభ కర్మలని కామ్యకర్మలు అంటారు. యజ్ఞం, దానం, తపస్సు మొదలైనవి కామ్య కర్మలు. యోగ ధ్యానాదులు చేయటానికి వేదాలలో పదునాలుగు కామ్య విద్యలు చెప్పారు. (తైత్తిరీయే పురుష విద్య మొదలైనవి) ఈ కామ్య కర్మలను విడిచి పెట్టటమే సన్యాసమని గీతలో స్వామి చెప్పాడు. ( 18–02) అన్నమయ్య కూడ ఈ గీతా భావాన్నే రెండవ చరణంలో పేర్కొంటూ కామ్య కర్మలు బంధాలు కలిగిస్తాయని, బంధాలు స్వామి సన్నిధికి పోనీవని చెబుతూ అందుకోసం దైవాన్ని ఎరగాలన్నాడు. అంటే–మననం చేయాలని భావం. దీనివల్ల రెండవ జ్ఞాన ప్రతిబంధం తొలగిపోతుంది.

*3. విపరీత భావన:* ఒక వస్తువునందలి నైజాన్ని వేరొక విధంగా తలిచే వ్యతిరేక భావనని విపరీత భావన అంటారు. స్వర్గమంటే మోక్షం అనుకోవటం విపరీత భావన. నిధి ధ్యాసనం (=ఏకాగ్ర చిత్తంతో మననం చేయటం వలన నేనే బ్రహ్మాన్ని అనే ఆనందం పొందటం) ద్వారా దీనిని పోగొట్టుకోవచ్చు. ఆ ధ్యాన మార్గంతో అన్నమయ్య శరణం చేయమన్నాడు.

సర్వ ధర్మాన్ పరిత్యజ్య... అనే గీతా శ్లోకాన్ని చరమ శ్లోకం అంటారు. స్వామిని శరణు వేడితే అన్నింటినుంచి రక్షణ కలుగుతుందని ఆశ్లోకం గొప్ప నైతిక స్థైర్యాన్ని ఇస్తుంది. మన అన్నమయ్య కూడ అదే గీతా పద్ధతిలో శరణం సర్వ సాధనమని తిరుగులేని నిర్వచనమిచ్చాడు.

ప్రకృతి అంటే స్వభావం. ఇది ప్రతి జన్మలో త్రిగుణాలుగా, రాగ ద్వేషాలుగా మార్పు చెందుతుంది. నేనే కర్తని అనే అహంకారంతో అజ్ఞానం మనిషిని కప్పివేస్తుంటుంది. ఈ దశలో అజ్ఞానానికి, విజ్ఞానానికి ఉదాహరణలు చెప్పి మనలను వివేకులుగా చేయటానికి – తిరుమల దేవుని పాదములనుండి అవతరించిన ఈ అన్నమయ్య కీర్తనా గంగ తలదాల్చిన వారిని పునీతం చేస్తూ ఉంటుంది.

## 9. కడలుడిపి నీరాడగా

కడలుడిపి నీరాడగా దలచువారలకు
కడలేని మనసునకు గడమ యెక్కడిది

1. దాహమణగిన వెనక తత్త్వమెరిగెదనన్న
దాహ మేలణగు తా తత్త్వమే మెరుగు
దేహంబుగలయన్నిదినములకును పదార్థ
మోహమేలుడుగు దాముదమేల కలుగు

2. ముందరెరిగిన వెనక మొదలు మరిచెదనన్న
ముందరే మెరుగు దా మొదలేల మరచు
అందముగ దిరు వేంకటాద్రీశు మన్ననల
కందువెరిగిన మేలు కలనైనలేదు

**భగవద్గీతా శ్లోకం**

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం
తత్పరః సంయతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాం
శాంతిమచిరేణాధిగచ్ఛతి
(గీ. 04-39)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

శ్రద్ధావంతుడైన తత్పరుడే యింద్రియ నియమాదులు కలవాడు జ్ఞానం పొందును.
(పుట-87)

***భావ విశేషాలు :***

ఒకాయన సముద్ర స్నానం చేద్దామని వెళ్లాడు. అలలు భయంకరంగా ఎగసి పడుతున్నాయి. అలలు తగ్గిన తర్వాత స్నానం చేద్దామనుకొన్నాడు. అతడి కోరిక ఎప్పటికి తీరదు. ఎందుకంటే అలలు ఎప్పుడు సముద్రంలో ఎగసి పడుతూనే ఉంటాయి. అలాగే అంతు పొంతు లేని కోరికలతో ఉండే మనస్సుకు 'ఇక్కడితో సరి' అని ఒక హద్దు పొద్దు ఎక్కడిది? (అలలు లేని సముద్ర స్నానం ఎలా అసాధ్యమో, కోరికలతో నిండిన మనస్సుతో మోక్షం అసాధ్యమని భావం)

1. తత్త్వం గురించి వివరంగా చెబుతాను వినమని ఒక గురువుగారు శిష్యునితో అన్నాడు. కోరికల మీద పూర్తిగా ఆశ తగ్గిన తర్వాత తత్త్వం నేర్చుకొంటానన్నాడు శిష్యుడు. వాడికి జన్మలో కోరికలు తీరలేదు, తత్త్వం తెలుసుకోలేదు. దాహం తీరాలంటే నీళ్లు తాగాలి, కాని నేయి తాగితే దాహం తీరకపోగా పెరుగుతుంటుంది. కోరికలు తీరటానికి చేసే ప్రయత్నం కూడ ఇటువంటిదే. అందువల్ల దాహం తీరిన తర్వాత-తత్త్వం తెలుసుకోవాలనుకోవటం వ్యర్థమైన పని. అతడికి దాహం తీరదు. తత్త్వం ఒంటపట్టదు. దేహమనే పదానికి అన్నరసాదులచే వృద్ధి పొందింపబడేది అనిఅర్థం. అందువల్ల ఈ దేహం ఉన్ననాళ్లు భక్ష్యాలు (=విరిచి నమిలి తినే పదార్థాలు), భోజ్యాలు (=ఉండలుగా చేసికొని తినే పదార్థాలు), లేహ్యాలు (=నాకి తినే పదార్థాలు) చోష్యాలు (=జుర్రుకొని తినే పదార్థాలు)-అనే పదార్థముల మీద మోహం పెరుగుతుంది కాని తగ్గదు. పరార్థ (=ఆధ్యాత్మిక) విషయాలలో సంతోషం కలుగదు.

2. నా ముందర ఏమి జరుగబోతోంది.. ఆ జ్ఞానం నాకు కావాలి. అంతేకాని ఈ జన్మకు సంబంధించి నన్ను మొదటినుంచి వెంబడించి వస్తున్న కర్మ వాసనల విషయం నాకు వద్దు. వాటిని మరిచి పోతానంటే-అది మామూలుగా కుదరని పని. ఇలా అనుకొనేవాడు జ్ఞానాన్ని ఏమి తెలుసుకొంటాడు? కర్మలనుంచి ఎలా విముక్తుడవుతాడు? అయితే ఒక చక్కటి ఉపాయం చెబుతాను.

మన సమీపంలో అందమైన శ్రీవేంకటేశ్వరుడు ఉన్నాడు. శరణుకోరి ఆయన అనుగ్రహాల చమత్కారం (=కందువ) తెలుసుకో చాలు. అన్ని కర్మలనుంచి విముక్తి అవుతావ్! జ్ఞానవంతుడివి అవుతావ్! కలలో కూడ ఇటువంటి అనుకోని లాభాలు లభిస్తాయని నువ్వు ఏనాడు ఊహించి ఉండవు. అందుకే ఆయనని శరణు వేడటం మానకు.

---

'చేపట్టిన పనిని ఎన్ని కష్టాలెదురయినా భయపడక పూర్తిచేయ్! ఏది ఎప్పుడు చేయాలో విచక్షణా జ్ఞానంతో చేయ్! సముద్రంలో స్నానం చేయాలంటే అలలనే కష్టాలు చూసి భయపడకు. జీవితం, సముద్రం ఒకటే.

అలలున్నాయని భయపడుతుంటే నువ్వు సముద్ర స్నానం ఏనాటికి చేయలేవ్! కష్టాలకి భయపడితే ఈ భవసాగరంలో నువ్వు ఈదలేవ్!' ఆధునిక తరంలో నిరాశలో కూరుకుపోతున్న యువకులనే అర్జునులకు అన్నమయ్య అనే గీతాచార్యుడు చేసిన ఈ గీతంలో చేసిన ప్రబోధమది.

అనేక దిక్కులనుంచి పొంగి ప్రవహిస్తూ వచ్చే నీళ్లు, సముద్రాన్ని చలింపచేయలేవు. అట్లే సమస్త భోగాలు స్థిత ప్రజ్ఞునిలో వికారాలు పెంచవు. అతడు పరమ శాంతంగా ఉంటాడు. భోగాలలో కోరిక ఉన్నవాడు ఏనాటికి శాంతిని పొందలేడు. (గీత02-70)అని సముద్రాన్ని - భగవద్గీత - సాంఖ్యయోగంలో అందమైన పోలికతో ఆవిష్కరించింది. అన్నమయ్య ఇదేసముద్రాన్ని అలల ముఖంతో దర్శించి మన మనస్సులలో సంతోష భావ తరంగాలను ఉప్పొంగేటట్లు చేసాడు.

'దేహో నాఽహం; కోహం సోఽహం' (నేను దేహాన్ని కాను; నువ్వెవరివి? ఆదేవుడే నేను) అని సంస్కృతంలో అందమైన ప్రయోగం. దేహము మీద చింత ఉన్నంతకాలం, ఆది తినే పదార్థాలు - లేదా - బయట కనిపించే పదార్థాలు - వీటిమీద వాంఛ పెరిగిపోతూనే ఉంటుంది. దేహం లోపల ఉన్న వాడి మీద చింత పెరుగుతున్నకొద్దీ - వాంఛ తరుగుతూ ఆనందం పెరుగుతుంటుంది. 'దేహంబుగలయన్ని యన్నిదినములకును పదార్థమోహమేలుడుగు దాముదమేల కలుగు' అని అన్నమయ్య మాటలలోని ఆంతర్యం ఇది.

ఈ అన్నమయ్య వాక్యాలకు ఇంకొక వివరణ కూడ చెప్పుకోవచ్చు. వేదాంత శాస్త్రంలో అన్నమయ (దేహం), మనోమయ (మనస్సు), ప్రాణమయ (ప్రాణం), విజ్ఞానమయ (ఆత్మ), ఆనందకోశాలుంటాయని (పరమాత్మ) చెబుతారు. ముఖ్యంగా గాఢ నిద్ర పోయేటప్పుడు ఆత్మ పరమాత్మకి దగ్గరగా చేరుతుంది. అప్పుడప్పుడు నిద్రలో ఉన్న వాళ్లు ఒక్కోసారి అపరిమితమైన ఆనందంతో నవ్వుతుంటారు. దీనికి కారణం అదే అని పెద్దలు చెబుతారు.

అయితే దేహాదుల భ్రాంతులవల్ల ఆత్మ పరమాత్మలో లీనం కాలేదు. అంటే శాశ్వతమైన ఆనందాన్ని పొందలేదు. అందుకోసమే పదార్థాల మీద - అంటే - విషయాల మీద వాంఛ - తగ్గించుకోవటానికి ప్రయత్నిస్తే ఆనందం కలుగుతుందని భావం. ఇందుకోసం సంయతేంద్రియః (ఇంద్రియాలను జయించాలి) అని గీతలో చెప్పిన మాటను 'కడలేని మనసునకు గడమ యెక్కడిది' అని అన్నమయ్య తనదైన శైలిలో చెప్పాడు. కోరికలకి ప్రయత్న పూర్వకంగా విరామచిహ్నం (ఫుల్‌స్టాప్) పెట్టకపోతే - జీవితం మనకు తెలియకుండానే విరామ చిహ్నాన్ని పెట్టేసుకుంటుంది. తస్మాత్ జాగ్రత - జాగ్రత.

## 10. చదివితి దొల్లి గొంత

చదివితి దొల్లి కొంత చదివేనింకా కొంత
యెదిరి నన్నెరగను యెంతైన నయ్యో

1. వొరుల దూషింతుగాని వొకమారైనా నా
దురిత కర్మములను దూషించను
పరుల నవ్వుదుగాని పలుయోనికూపముల
నరకపు నామేను నవ్వుకోను

2. లోకుల గోపింతుగాని లోని కామాదులనేటి
కాకరి శత్రుల మీద గడు కోపించ
ఆకడ బుద్ధులు చెప్పి అన్యుల బోధింతుగాని
తేకువ నాలోని హరి దెలుసుకోలేను

3. యితరుల దుర్గుణములెంచి యెంచి రోతుగాని
మతిలో నాయాసలు మానలేను
గతిగా శ్రీవేంకటేశుగని బ్రదికితిగాని
తతి నిన్నాళ్లదాకా దలపోయలేను

(తా.ప.సా.04-74)

**భగవద్గీతా శ్లోకం**

ఉద్ధరేదాత్మనాత్మానం
నాత్మానమవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో
బంధురాత్మైవ రిపురాత్మనః

(గీ. 06-05)

---

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

విషయాల దగులని చిత్తం చాతను, ఆత్మను ధరించెడి విపరీత చిత్తం చాతను ఆత్మ నాశనం చేసుకోవల్దు. తన మనస్సే తనకు బంధువు. తన మనస్సే తనకు శత్రువు.

(పుట-107,108)

---

*భావ విశేషాలు* :

ఇదివరకు కొంత చదివాను. ఇంకా కొంత చదువుతాను. కాని ఏం ప్రయోజనం. నాలో ఉన్న నా శత్రువును గురించి తెలుసుకోలేకపోతున్నాను.

01. ఇతరులను నిందించటం అలవాటయింది కాని, నా పాపపు కర్మలని (=దురిత కర్మలు) నిందించను. ఇతరులను చూసి నవ్వుకొంటుంటాను కాని, అనేక జన్మలనెత్తి, నరకాలలో పడి బాధలుపడే నా శరీరాన్ని చూసి నవ్వుకోను.

02. లోకులను చూసి కోపపడుతుంటాను గాని, నాలోపల ఉన్న కామము మొదలైన మాయగాళ్లయిన (=కాకరి) శత్రువుల మీద బాగా కోపం తెచ్చుకోను. విద్యా బోధన జరిగే - ఆ పవిత్ర ప్రదేశంలో (=ఆ-కడ) - బుద్ధులు చెప్పి ఇతరులకు బోధిస్తుంటాను కాని, వివేకంతో (=తేకువ) నాలోపల ఉన్న హరిని తెలుసుకోలేను.

03. ఇతరుల దుర్గుణాలు ఎంచటానికి ఆసక్తి చూపించి ఆసహ్యించుకొంటాను కాని, మతిలో నా అసహ్యపు కోరికలు మానలేను. నా గతిగా శ్రీవేంకటేశుడిని చూసి బతికాను కాని, తరిగిపోతున్న నా కాలాన్ని (=తతిని) ఇన్నాళ్లదాక తలపోయలేదు.

చదువుల మీద అన్నమయ్య రకరకాల పద్ధతులలో  తన గీతాలలో వ్యాఖ్యానాలు చేసాడు.

'ఇదివరకు కొంత చదివాను. ఇంకా కొంత చదువుతాను. కాని ఏం ప్రయోజనం. నాలో ఉన్న నా శత్రువును గురించి తెలుసుకోలేకపోతున్నాను.' ఈ పల్లవిలో శత్రువులను ఎదిరించే పద్ధతిని దృఢంగా చదువులు నేర్పలేకపోతున్నాయని ఒక ఆవేదనతో కూడిన విసురు ఉంది. 'తన మనస్సే తనకు బంధువు. తన మనస్సే తనకు శత్రువు.' అనే భగవద్గీతా పాఠాన్ని వివరంగా హృదయానికి హత్తుకొనేటట్లుగా చదువులు నేర్పటంలేదు. అందువల్ల ప్రతి వ్యక్తి తనలో ఉన్న శత్రువును తెలుసుకోలేక పోతున్నాడని, అందువల్ల తనని తాను ఉద్ధరించుకోలేకపోతున్నాడని బాధ పడుతూ, చదువుద్వారా మనిషికి రావలిసిన సిసలైన వ్యక్తిత్వాన్ని చరణాలలో వివరిస్తున్నాడు.

పుణ్య, పాప, మిశ్రమ కర్మలు, విధి, నిషేధ, ప్రాయశ్చిత్త కర్మలు, సంచిత కర్మలు (అనేక జన్మలలో చేయబడి ఇంతవరకు అనుభవింపబడకుండ సంస్కార రూపంలో నిలిచి ఉండేవి) ఆగామి కర్మలు (ముందు జన్మలలో ఫలితం కలిగించేవి) ప్రారబ్ధ కర్మలు (ఈ శరీరంలో సుఖ దుఃఖాలను కలిగించేవి), కేవల ఐహిక కర్మలు, కేవల ఆముష్మిక కర్మలు, ఐహికాముష్మిక కర్మలు – ఇలా ఎన్నెన్నో కర్మలు. వీటిలో తెలిసి చేసినా – తెలియక చేసినా – పాపాన్ని కలిగించే కర్మలు చాలా ఉన్నాయి. 'నాకు సంబంధించిన కర్మలను ఏనాడు నిందించను, స్వామిని శరణు వేడి వాటిని పోగొట్టుకోవటానికి ప్రయత్నించను కాని ఇతరులను తిట్టడానికి మాత్రం చాలా ఉత్సాహపడతాను' అని అన్నమయ్య ఘాటుగా నిందాపరుల జీవనాన్ని విమర్శించాడు. పర నిందలను మానుకొమ్మని, తన జీవితాన్ని నిందా రహితంగా ఉద్ధరించుకొమ్మని ఒక గొప్ప సందేశం ఇందులో ఉంది.

ఈ గీతంలో 'నేను' అనేదానిని అన్నమయ్యకి మాత్రమే అన్వయించుకోకూడదు. ప్రతి జీవుడు ఈ 'నేను' లో కనబడతాడు. కనబడాలి. అన్నమయ్య–జీవితంలో దిగజారిపోయిన వ్యక్తికి ఈ లక్షణాలు ఉంటాయన్నాడు.

1. ఇతరులను దూషించటం 2. ఇతరులను ఎగతాళి చేస్తూ వెక్కిరించటం 3. ఊరికే ఇతరుల మీద కోప్పడటం 4. తాను ఆచరించకపోయినా ఇతరులకు నీతి పాఠాలు చెప్పటం 5. ఇతరుల గోరంత తప్పులను కొండంతలుగా చేసి ప్రచారం చేయటం 6. కాలం విలువను తెలుసుకోలేకపోవటం ఆరు లోపాలకు  ఆ–**'గీతా'**చార్యుడు  ఇలా నివారణోపాయాలు చెప్పాడు.

1. జన్మ జన్మలనుండి వస్తున్న కర్మలను నిందించుకో 2. నువ్వు ఎత్తుతున్న జన్మ కష్టాలను చూసి నవ్వుకో 3. కోరిక మొదలైన శత్రువుల మీద కోప్పడు 4. నీలో ఉన్న హరిని ప్రతి నిమిషం తలుచుకొని నీతిగా బతుకు. 5. ఛండాలమైన ఆశలను తగ్గించుకో 6. కాలం విలువను తెలుసుకొంటూ హరిని ధ్యానించు మానవుడు కర్మాధీనుడని చెబుతూ (18–60) దాని తర్వాత శ్లోకంలో తనను శరణు వేడమని (18–62)  అందువల్ల కర్మల బంధాన్నుంచి, మాయల బంధాన్నుంచి  మానవుడు విముక్తుడవుతాడని భగవద్గీతలో స్వామి చెప్పాడు.

భగవద్గీతలోని అటువంటి భావాల  ఆధారంగా రాసిన  ఇటువంటి చదువు కీర్తనలలో ఆధునిక జీవితానికి పనికివచ్చే వ్యక్తిత్వ పాఠాలు చాలా ఉన్నాయి. అన్నమయ్య కీర్తన వేంకటేశ్వరుని చిరునవ్వు మాత్రమేకాదు. గీత అనే కాంతితో వ్యక్తిత్వాన్ని ఉన్నతంగా ఆవిష్కరించే పతాక.

## 11. తందనాన ఆహి తందనాన పురె

**తందనాన ఆహి తందనాన పురె**
**తందనాన భళా తందనాన**
**బ్రహ్మమొకటె పరబ్రహ్మమొకటె**
**పరబ్రహ్మమొకటె పరబ్రహ్మమొకటే**

1. **కందువగు హీనాధికములిందులేవు**
**అందరికి శ్రీహరే అంతరాత్మ**
**ఇందులో జంతుకులమింతానొకటే**
**అందరికి శ్రీహరే అంతరాత్మ**

2. **నిండార రాజు నిద్రించు నిద్రయునొకటే**
**అండనే బంటు నిద్రదియునొకటే**
**మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమి యొకటే**
**చండాలుండేటి సరిభూమి యొకటే**

3. **కడగి యేనుగు మీద గాయు యెండొకటే**
**పుడమి శునకము మీద బొలయు నెండొకటే**
**కడు బుణ్యులను బాపకర్ములను సరిగావ**
**జడియు శ్రీవేంకటేశ్వరు నామ మొకటే**

**(తా.ప.సా.2-385)**

**భగవద్గీతా శ్లోకం**

'విద్యావినయ సంపన్నే
బ్రాహ్మణే గవిహస్తిని
శునిచైవ శ్వపాకేచ
పండితాస్సమ దర్శినః' (గీ. 05-18)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

...సమదర్శితులైన పండితులు విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణునందున్నూ, ఆవుల యందున్నూ, యేనుగుల యందున్ను, కుక్కల యందున్ను, కుక్కలను వండుకొని తినేవాని యందున్ను వుండే యాత్మను, జ్ఞాన స్వరూపుడైన ఆత్మను తమ సమానముగానే చూతురు. యిటనగా యేమి యనుట అంటేను? వారి శరీరాలే కర్మం వలననే హీనులున్ను, అధికాలున్ను ఆయగాని ఆత్మ లెల్లాను వక్కరీతివారే అనుట.

(పుట-100)

***భావ విశేషాలు :***

మనుష్యలందరూ ఒక్కటే. 'ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ కాదు.' ఈ సామ్యవాద సందేశాన్ని అన్నమయ్య కవి ఈ తందనాన (=ఉత్సాహంతో చేసే ఒక ధ్వని) కీర్తనలో అందించాడు. అనేక రూపాలలో పూజింపబడుతున్నప్పటికీ దేవుడనే వాడొక్కడే! అనేక మతాలలో, కులాలలో పుట్టినప్పటికీ మానవుడనేవాడు ఒక్కడే! (ఎక్కువ తక్కువలు లేవని భావం)

1. ఎక్కువ తక్కువలు చేసి మనుష్యులను తెగలుతెగలుగా (=కందువగు) చూపిస్తుంటారు. అది తప్పు. ఈ ప్రపంచములోఉన్న జీవులలో (=జంతుకులమంతా) ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ కాదు. అందరూ సమానమే. అందరిలోను ఉన్న దేవుడొక్కడే. అతడే విష్ణువు.

2. కళ్లనిండుగా, హాయిగా రాజు పోయే నిద్ర ఒకటే. దగ్గరగా (=అండనే) సేవకుడు పోయే నిద్ర కూడ ఒకటే. (నిద్ర ఇద్దరికి సమానమే.) గొప్పవాడని పిలిచే బ్రాహ్మణుడు తిరిగే భూమి ఒకటే. తక్కువ వాడని అజ్ఞానంతో కొందరు పిలిచే చండాలుడు తిరిగే భూమి ఒకటే. (ఇద్దరినీ మోసే భూమి ఒకటైనప్పుడు ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ కానేకారు)

3. పెద్దదైన ఏనుగు మీద చిన్నదయిన కుక్కమీద కాసే ఎండ ఒకటే. అలాగే పాపాత్ములను, పుణ్యాత్ములను సమానంగా రక్షించే శ్రీ వేంకటేశ్వరుని నామం ఒకటే.

పండ అంటే బుద్ధి. అది ఉన్న వాడిని పండితుడంటారు. పండితులు బాగా చదువుకొన్న బ్రాహ్మణుని, గోవును, ఏనుగును, కుక్కను, చండాలుని ఒకే రకంగా సమానంగా చూస్తారు. ఒకదాన్ని ఎక్కువగా మరొకదాన్ని తక్కువగా చూడరని గీతార్థం. అందుకే అన్నిటిలోను ఉన్న పరబ్రహ్మమొకటేనని భావించిన రామకృష్ణ పరమహంస కుక్కలు ఎంగిలాకులు తింటుంటే వాటి పక్కన కూర్చుని తానుకూడ ఆ ఎంగిలిని భుజించాడు. 'నీవార శూకవత్తన్వీ.....' అంటూ మంత్రపుష్పం ప్రతి జీవిలోను స్వామి వరిగింజకొన ఆకృతిలోఉన్నాడని విస్పష్టంగా చెప్పింది.

హలో....ల పిలుపులతో బాగా 'లో' కి – మనిషిని అథః పాతాళానికి దిగజార్చే సంప్రదాయం కాదు మనది. మనసంప్రదాయం 'నమస్తే' అని ఎదుటి వారిని గౌరవించమంది. నమః + తే = నీకు నమస్కారం. నీకు అంటే ఎదుట కనిపించే రూపానికి కాదు. అంతరాత్మగా ప్రతిజీవి లోపల ఉన్న పరమాత్మకు నమస్కారం అని నమస్తేలోని అంతరార్థం.

కార్ల్ హెన్రిక్ మార్క్స (1818–1883) పెట్టుబడిదారీ వ్యవస్థ సామ్యవాద వ్యవస్థ ద్వారా తొలగింపబడుతుందని, తద్వారా రాజ్యం లేని వర్గరహిత సమాజం ఏర్పడుతుందని మాబాగా చెప్పాడని గొప్పగా పొగుడుతాం. ఇదేవిషయాన్ని అందరూ సమానంగా ఉంటే అందరూ సుఖంగా ఉంటారని – ఆధ్యాత్మిక దృష్టితో – కార్ల్ హెన్రిక్ మార్క్స్ కంటే కొన్ని వేల/వందల సంవత్సరాల క్రితం భగవద్గీత, అన్నమయ్య చెప్పారంటే ఒప్పుకోవటానికి మనలో చాలామంది మనస్సులు ఒప్పుకోవు. అది ఈ జాతి దౌర్భాగ్యం.

బ్రహ్మ అంటే శుభమైన గుణాలు అనంతంగా ఉన్న పురుషోత్తముడైన శ్రీనారాయణుడని రామానుజులు తమ శ్రీభాష్యంలో చెప్పారు. అన్నమయ్య పరబ్రహ్మం కూడా నారాయణుని మరో స్వరూపమైన శ్రీవేంకటేశ్వరుడే. 'పాయను నిన్నిక శ్రీవేంకటపతి పరబ్రహ్మమవు అటుగాన' **(10–103)** అనే పాదంలో కవి ఈ విషయాన్ని స్పష్టపరిచాడు. శవాలు శయనించే భూమి శ్మశాన భూమి. ఇదే ఒలికి మిట్ట. జీవితంలో చివరిగా అడుగు బెట్టే 'మెట్టుగడ్డ'. దీనినే అన్నమయ్య సున్నితంగా 'మెట్టుభూమి' 'సరిభూమి' అని ఈ గీతంలో అన్నాడు. బ్రాహ్మణుడైనా, చండాలుడైనా, చివరిమజిలిలో శయనించే భూమి ఒకటే అయినప్పుడు, చావుకి అందరూ సమానమైనప్పుడు ఇంకా 'నేనెక్కువ, నువ్వు తక్కువ' వంటి తగాదాలు ఎందుకని కవి మందలింపు. పుణ్యం చేసినవాడు, పాపం చేసినవాడు ఇద్దరూ దేవుడి దృష్టిలో సమానమే.... ఇద్దరినీ దేవుని నామం కాపాడుతుందని మూడో చరణం ముక్తాయింపులో అన్నమయ్య అన్నాడు. ఇది భగవద్గీతలోని 'అపిచేత్సుదురాచారో.... (09–30) శ్లోకానికి దగ్గరి అనువాదం.

'ఇదేమన్నా బ్రహ్మవిద్యా!' అని అప్పుడప్పుడు మనం అంటుంటాం. బ్రహ్మవిద్యను నేర్చుకోవటం కష్టమని భావం. మన సంప్రదాయం ప్రకారం బ్రహ్మవిద్యలు 32. ఎంతో కష్టసాధ్యమైన ఆ విద్యలను నేర్చుకొని, వాటిని చదువలేని మనబోటివాళ్ల కోసం వాటి సారాంశాన్ని క్రోడీకరించి అన్నమయ్య ఈ కీర్తనలో పొందుపరిచాడు.

# 12. త్రికరణ శుద్ధిగ చేసిన

త్రికరణ శుద్ధిగ జేసిన పనులకు దేవుడు మెచ్చును లోకము మెచ్చును
వొకటి కోటి గుణితంబగు మార్గములుండగ బ్రయాస పడనేలా

1. తన మనసే పరిపూర్ణమైన గోదావరి గంగాకావేరి
కనక బిందుయమునా గయాది ముఖ్య క్షేత్రంబుల సంతతమున్
దినకర సోమ గ్రహణ కాలముల తీర్థాచరణలు సేసిన ఫలములు
తనుదానే సిద్ధించును పూరకే దవ్వులుదిరుగగ మరి యేలా

2. హరి యను రెండక్షరములు నుడివిన నఖిల వేదములు మంత్రములు
గరిమ ధర్మ శాస్త్ర పురాణాదులు క్రమమున జదివిన బుణ్యములు
పరమ తపోయోగంబులు మొదలగు బహుసాధనముల సారంబు
పరి పక్వంబై ఫలియించంగా బట్టబయలు వెదకగ నేలా

3. మొదల శ్రీవేంకటపతికిని జేయెత్తి మొక్కిన మాత్రము లోపలనే
పదిలపు షోడశ దాన యాగములను పంచ మహా యజ్ఞంబులును
వదలక సాంగంబులుగా జేసిన వాడే కాడాపలుమారు
మదిమది నుండే కాయ క్లేశము మాటికి మాటికి దనకేలా

(తా.ప.సా.2-236)

**భగవద్గీతా శ్లోకం**

కాయేన మనసా బుద్ధ్యా
కేవలైరింద్రియైరపి
యోగినః కర్మ కుర్వంతి
సంగంత్యక్త్వాత్మ శుద్ధయే

(గీ. 05-11)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

శరీరం చాతను, మనస్సు చాతను, కేవలమైన యింద్రియల చాతను ఆత్మ నిష్ఠులు ఫల సంగం విడిచి, చిత్త శుద్ధి కొరకు కర్మమును శేయుదురు.

(పుట-96)

***భావ విశేషాలు :***

1) మనస్సులోను, 2) వాక్కులోను, 3) చేసే పనిలోను పవిత్రత ఉండాలి. ఆలా ఉంటే-ఆ త్రికరణ శుద్ధి ఉంటే-దేవుడు మెచ్చుతాడు. లోకం మెచ్చుతుంది. ఇతరమైన మార్గాల కంటె త్రికరణ శుద్ధి మార్గం కోటి రెట్లు ఎక్కువ. ఊరికే శ్రమ పడతావెందుకు?

1. శరీరం ఆరోగ్యం సహకరించకపోయినా-గోదావరి, గంగ, కావేరి, కనకబిందు, యమున-మొదలైన నదులలో మునగాలని-గయ మొదలైన ముఖ్య క్షేత్రాలకు వెళ్ళాలని-వెళ్లకపోతే ఏమవుతుందో అనే బెంగతో -ఉండకు. సూర్య, చంద్రగ్రహణాలు వచ్చినప్పుడు ఈ నదులలో స్నానం చేయాలి. ఈ తీర్థయాత్రలు చేయాలి అనే మాటలు వింటూ - ఆ అదృష్టం నాకు లేదని బాధ పడకు. ఒక్కసారి కళ్లు మూసుకొని పవిత్రమైన నీ మనస్సులోకి చూడు. సకల క్షేత్రాలు, నదులు నాదగ్గరే ఉన్నాయి అని సంకల్పం చెప్పుకో. ఆ నదీ స్నాన ఫలితం, తీర్థయాత్రల ఫలితం నీకు అనాయాసంగా సిద్ధిస్తాయి. మనస్సు పవిత్రత లేకుండా ఊరికే అన్ని దూరాలు తిరుగుతూ బాధ పడటం దేనికి?

2. వందేళ్లు ఎలాగూ ఈ కల్మష వాతావరణంలో బతకలేం. సగటుగా 60 ఏళ్లు బతికితే, అందులో సగం-అంటే 30 ఏళ్లు నిద్రలో సరిపోతుంది. మిగతా 30 ఏళ్లలో వేదాలు, మంత్రాలు, పురాణాలు, గొప్ప గొప్ప ధర్మ శాస్త్రాలు ఎప్పుడు చదవాలి? ఆ పుణ్యాలన్నీ నా కెప్పుడు రావాలి? ఆ తపస్సు చేసే యోగం నా కెప్పుడు సిద్ధిస్తుంది? అని ఊరికే దిగులు పడకు. హరి అనే రెండక్షరాలు

భక్తిగా నోరారా పిలువు. ప్రపంచంలోని అన్ని విద్యలు వాటి సారాంశాలతో నీలో కదలాడుతాయి. వాక్కులో పవిత్రత లేకుండా ఊరికే అది చదవలేదు-ఇది చదవలేదు అని బాధపడకు.

3. గట్టిగా కూచోలేవు. ....పడుకోలేవు.. తీర్థయాత్రలు చేయకపోతే పుణ్యం రాదేమోనని బాధతో.. ఈ శరీరాన్ని కష్టపెట్టి మాటిమాటికి దేశాలు తిరిగి రావాలని చూడకు. ఒక్కసారి నీ కళ్లెదురుగ కనబడుతున్న శ్రీవేంకటేశ్వరునికి చేతులెత్తి 'గోవిందా! గోవిందా!' అంటూ నోరారా నమస్కరించు. 16 రకాల దానాలు చేసిన ఫలితం, పంచ మహా యజ్ఞాలు చేసిన ఫలితం నీకు తప్పక సిద్ధిస్తుంది. నా మాట నమ్ము. కర్మలో పవిత్రత లేకుండా అదేపనిగా శరీరాన్ని, మనస్సును కష్టపెట్టకు.



అన్నమయ్య తీర్థయాత్రలు మొదలైనవి తప్పనటంలేదు. మనం ఒకరకంగా చేస్తుంటే, వాటిని ఇంకోరకంగా చేయమంటున్నాడు. కస్తూరి మృగం తనలోనే కస్తూరి ఉంచుకొని, కస్తూరి ఎక్కడినుంచో వస్తోందని వెతుక్కుంటుందట. చంకలో పిల్లవాడిని పెట్టుకొని ఒకావిడ ఊరంతా వెతికిందట. ఇలాగే చెంతనే వేంకటేశ్వరుడు ఉండగా ఇతర చింతలు నీకెందుకు? నీ చింతన సమగ్రంగా ఆయన మీదే పెట్టు. అన్నిరకాల ఫలితాలు నీకు లభిస్తాయని కవి ప్రబోధం.

తీర్థ యాత్రలు మొదలైన వాటికి వెళతాం. అక్కడి అసౌకర్యాలకు, లంచగొండితనాలకు మనస్సు చివుక్కుమంటుంది. నోట్లకట్టలు కరిగిపోతున్న బాధలో - ఎవడి మీద మనస్సు కరగాలో- ఆ దేవుడి పట్ల మనస్సు కరగదు. యాత్రలకు వెళ్లి మనస్సును పరిశుద్ధం చేసుకోవలిసింది పోయి, చెత్త ఆలోచనల బరువుని నింపుకొని ఇంటికి వస్తాం. ఇప్పుడు యాత్ర చేసిన ఫలితం ఏముంది? లేనిపోనిది పుణ్యానికి పోతే పాపం ఎదురవుతుంది. పవిత్రమైన మనస్సులేని ఇటువంటి తీర్థయాత్రలు నిరసించదగినవే.

గో, భూ, తిల, హిరణ్య, రత్న, విద్య, కన్య, దాసి, శయ్య, గృహ, అగ్రహార, రథ, గజ, అశ్వ, ఛాగ, మహిషీదానాలు షోడశ మహా దానాలు. అగ్ని హోత్రం, దర్శ పూర్ణ మాసం, చాతుర్మాస్యం, నిరూఢ పశుబంధం, జ్యోతి ష్టోమం అనేవి పంచ మహా యజ్ఞాలు అని ఒకపట్టిక. బ్రహ్మ యజ్ఞం (వేద శాస్త్రాలు చదవటం), దేవ యజ్ఞం (దేవతలని పూజించటం) పితృయజ్ఞం (పితృదేవతలకి శ్రాద్ధ తర్పణాదులు ఇవ్వటం) అతిథి యజ్ఞం (అతిథి సత్కారం చేయటం) భూతయజ్ఞం (పశు పక్ష్యాదులను యథాశక్తి పోషించటం) అని ఇంకో పంచ మహా యజ్ఞాల పట్టిక ఉంది. ఈ యజ్ఞాలు చేసిన ఫలితం - వేంకటేశ్వరునికి చేయెత్తి మొక్కితే లభిస్తుందని అన్నమయ్య అభిప్రాయం.

మనస్సుకు పవిత్రత ఎలా వస్తుందో మొదటి చరణంలో, వాక్కుకు పవిత్రత ఎలా వస్తుందో రెండవ చరణంలో, చేసే పనికి పవిత్రత ఎలా వస్తుందో - మూడో చరణంలో క్రమంగా వివరించిన అన్నమయ్య కవితా ప్రతిభకు జోహారు అనక తప్పదు. అన్నమయ్య కీర్తనల్లోని పల్లవి మొగ్గ లాంటిది. అది పుష్ప వికాసంగా చరణాలలో మారుతుంది. ఈ దృష్టితో అన్నమయ్య కీర్తనలు చదవాలి.

కర్మ యోగం-జ్ఞాన యోగానికి ఒక చక్కటి మార్గంగా పెద్దలు చెబుతారు. వేలకొలది మనుష్యులలో భగవంతుని యథార్థ స్వరూపాన్ని ఒకడు మాత్రమే తెలుసుకొంటాడు. (గీతం 7-03). ఆ యథార్థ స్వరూపాన్ని త్రికరణ శుద్ధిగా తాను దర్శించి, మనలని ఉద్ధరించటానికి అన్నమయ్య ఈ గీతం రాసాడు.

## 13. తెలిసితే మోక్షము

తెలిసితే మోక్షము తెలియకున్న బంధము
కలవంటిది బదుకు ఘనునికిని

1. అనయము సుఖమేడదవల దుఃఖమేడది
తనువుపై నాసలేని తత్వమతికి
పొనిగితే బాపమేది పుణ్యమేది కర్మమందు
వొనర ఫలమొల్లని యోగికిని

2. తగిన యమృతమేది తలపగ విషమేది
తెగి నిరాహారియైన ధీరునికిని
పగవారనగ వేరి బంధులనగ వేరీ
వెగటు ప్రపంచమెల్ల విడిచే వివేకికి

3. వేవేలు విధులందు వెరపేది మరపేది
దైవమును నమ్మినయట్టి ధన్యునికిని
శ్రీవేంకటేశ్వరుడు చిత్తములో నున్నవాడు
యీవలేది యావలేది యితని దాసునికి

(తా.ప.సా.2-19)

**భగవద్గీతా శ్లోకం**

ప్రవృత్తిం చ నివృత్తించ
కార్యా కార్యే భయాభయే
బంధంమోక్షం చ యా వేత్తి
బుద్ధి స్స పార్థ సాత్వికీ

(గీ. 18-30)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

సంసారమున్ను, మోక్షమున్నూ యే బుద్ధి విచారించుకొనును అది సాత్విక బుద్ధి.

(పుట-317)

*భావ విశేషాలు :*

'జ్ఞానికి ఘనుడు, తత్వమతి, యోగి, ధీరుడు, వివేకి, ధన్యుడు, వేంకటేశుని దాసుడు అను పేర్లు పెట్టి అతని లక్షణాలను అన్నమయ్య ఈ కీర్తనలో తెలియచేస్తున్నాడు.

జీవితం యొక్క నిజమైన అర్థాన్ని తెలుసుకొంటే అది మోక్షం. తెలుసుకోకపోతే జీవితమే ఒక బంధం. ఈ జీవితం కలవంటిదని గొప్పవాడయిన జ్ఞానికి తెలుసు.

1. శరీరం మీద ఆశలేని తత్వవేత్తకు ఒకప్పుడు సుఖముండదు. ఇంకొకప్పుడు దుఃఖముండదు. ఎప్పుడూ అతనిది ఒకే రకమైన సమస్థితి. కర్మ ఫలితాన్ని శూన్యంగా (=పొనిగితే) భావించి, దానిని ఆశించని యోగికి పాపము లేదు. పుణ్యం లేదు. రెంటికి అతీతమైనస్థితి అతనిది.

2. సాహసించి (=తెగి) తిండిలేకుండా గడిపే ధీరునికి అమృతం, విషం - అని తేడాలుండవు. వెగటు గొలిపే ఈ ప్రపంచాన్ని విడచిన వివేకికి వీళ్లు శత్రువులు, వీళ్లు బంధువులు అని ఉండరు. అందరూ అతని దృష్టిలో సమానమే.

3. దైవాన్ని సర్వాత్మనా నమ్మిన భక్తునికి సాంప్రదాయికమైన పూజా కార్యక్రమాలు నిర్వర్తించేటప్పుడు ఇలా చేయకూడదేమో! ఇలా చేస్తే ఈ కీడు వస్తుందేమో! అను భయముండదు. (ఎందుకంటే అతను దైవం చేత ఆశీర్వదింపబడ్డాడు కనుక). తన చిత్తంలో శ్రీవేంకటేశ్వరుని నిలుపుకొన్న భక్తునికి ఈ లోకంలోను, పై లోకంలోను కర్మఫలాలు తాకవు.

**'సంసారమున్ను, మోక్షమున్నూ యే బుద్ధి విచారించుకొనును అది సాత్విక బుద్ధి.'** అన్న గీతా వాక్యాన్ని (గీత 18-30) అన్నమయ్య ఇంకా సొగసుగా 'జీవితం యొక్క నిజమైన అర్థాన్ని తెలుసుకొంటే అది మోక్షం. తెలుసుకోకపోతే జీవితమే ఒక బంధం' అన్నాడు. బుద్ధి విచారించుకోవటం - అంటే తెలుసుకోవటం అన్నాడు కవి. జీవితం యొక్క నిజమైన అర్థం దైవాన్ని తెలుసుకోవటం, అంటే పరమాత్మనుంచి విడివడిన జీవాత్మ - జనన మరణ చక్రంలో తిరిగి పడకుండా పరమాత్మలో కలవటం. ఈ తత్వాన్ని తెలుసుకొని - మనలో ఉన్న దైవాన్ని మాయ పొరలు దాటి తెలుసుకోవటం. ఇదే మోక్షం. ఇవన్నీ కుదరవని - పంది బురదలో పడి దొర్లుతున్నట్లుగా సంసారంలో సుఖ దుఃఖాల లంపటంలో పడి కొట్టుకోవటం బంధం.

నీకు బంధం కావాలా? మోక్షం కావాలా? తెలుసుకొమ్మంటూ - మొట్టమొదట వాటిని నిర్వచించాడు కవి. అక్కడితో ఆగితే ఆయన **అన్నమాచార్యుడు** ఎందుకవుతాడు? నాయనా! బంధాలలో పడి కొట్టుకు పోకురా! ఈ జీవితం కలవంటిది! అని హెచ్చరించాడు. అంటే కల ఎలా అవాస్తవమో, ఈ జీవితం కూడ అంతే అవాస్తవమని, కనుక అశాశ్వతమైన బంధాలనుంచి విడివడి మోక్షం గురించి ఆలోచించమని అన్నమయ్య అనే గురువు మనందరికి ఉపదేశిస్తున్నాడు.

యోగాన్ని భగవద్గీత గొప్పగా నిర్వచించింది. అన్నిటియందు సమంగా ఉండటమే యోగం. సరిగ్గా దీనినే 'అనయము సుఖమేడదవల దుఃఖమేడది తనువుపై నాసలేని తత్వమతికి' అని అన్నమయ్య ఈ కీర్తన మొదటి చరణంలో వ్యాఖ్యానించాడు.

'యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్' అన్నది గీత (18/37). పరమాత్మకు సంబంధించిన విషయం ప్రారంభంలో విషం లాగా అనిపించినప్పటికీ, క్రమంగా అమృత సమానమవుతుంది. భుజించేది ఆహారం. లౌకిక విషయాలను భుజించినవాడికి - అంటే - తనలోకి జీర్ణింపచేసుకొంటూ ఉన్నవాడికి - సుఖాన్నిచ్చే విషయాలు అమృత సమానాలవుతాయి. దుఃఖాన్నిచ్చే విషయాలు విష సదృశాలవుతాయి. సుఖమైనా - దుఃఖమైనా - ఏ విషయమైనా - తనలోకి - రానివ్వని-జ్ఞాని-అన్నమయ్య వర్ణించిన నిరాహారి. అతనికి అమృతం - విషం - అనే తేడా ఉండదు.

ఒక పట్టణంలో ఆనందంగా ఉత్సవాలు జరుగుతున్నాయి. ఒకతని నెత్తి మీద నిండా పాలు ఉన్న గిన్నె ఉంది. అతను ఆ ఉత్సవాలు చూస్తూ బజార్లలో తిరగాలి. కాని నెత్తి మీద ఉన్న గిన్నెలోనుంచి ఒక్క పాలచుక్క కిందకు జారకూడదు. ఇది ఆ బాటసారికి రాజుగారిచ్చిన ఆజ్ఞ. ఆ బాటసారి ఉత్సవాలు జరుగుతున్న వీధులలో నడుస్తున్నాడు కాని వాటిని చూసి ఆనందించలేక పోతున్నాడు. ఆ విషయాలేవి అతని మనస్సులోకి ఎక్కటంలేదు. ఎందుకంటే అతని మనస్సంతా పాలగిన్నె మీద ఉంది. పాలగిన్నె మృత్యువు. అందులోని పాలు మనస్సు. ఆనందం లేదా దుఃఖాన్నిచ్చే విషయాలు (రస విషయికంగా) ఉత్సవాలు. జ్ఞాని కూడ ఇంతే. మనస్సంతా స్వామి మీద ఉన్నప్పుడు, లౌకిక విషయాలు అతనికి పట్టవు. అతను ప్రపంచంలోనే ఉంటాడు కాని, ప్రపంచం అతనిలో ఉండదు.

ఎంత కష్టమైన విషయానికైనా అన్నమయ్య సులభ పరిష్కారం చెబుతాడు. 'ఈ కర్మలు ఇవన్నీ నాకు అర్థం కావటంలేదు. జన్మ ఎత్తకుండా ఉండాలంటే ఏం చేయాలి' అని ప్రశ్నిస్తే శ్రీవేంకటేశ్వరుని శరణమనే సులభ పరిష్కారాన్ని అన్నమయ్య ఈ కీర్తన చివర్లో సూచిస్తున్నాడు. దానిని పాటించి మనం కూడ తరిద్దాం.

## 14. దేహి నిత్యుడు

దేహి నిత్యుడు దేహములనిత్యాలు
ఈహల నా మనసా యిది మరవకుమీ

1. గుది బాతచీర మాని కొత్త చీర గట్టినట్టు
ముది మేను మాని దేహి మొగి గొత్త మేనుమోచు
అదన జంపగలేవు ఆయుధములీతని
గదిసి అగ్నియు నీరు గాలియు చంపగలేవు

2. యీతడు నరకువడడు యీతడగ్నిగాలడు
యీతడు నీట మునుగ డీతడు గాలిబోడు
చేతనుడై సర్వగతుండౌ చెలియించడేమిటను
యీతల ననాది యీతడిరవు గదలడు

3. చేరి కానరానివాడు చింతించరానివాడు
భారపువికారాల బాసినవాడీ ఆత్మ
ఆరయ శ్రీవేంకటేశునాధీనమీతడని
సారముతెలియుటే సత్యం జ్ఞానము

(తా.ప.సా.2-419)

### భగవద్గీతా శ్లోకం

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరో౽పరాణి
తథా శరీరాణి విహాయ
జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహి
(గీ. 02-22)

### పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం

మనుష్యుడు పాత కోకలు విడిచి, కొత్త కోకలు యెటువలెనైనానేమి కట్టుకొనునో, అటు వలెనే దేహీన్నీ జీర్ణమైన శరీరాలు విడిచి వేరే కొత్త శరీరాలు ధరియించును.
(పుట-31)

*భావ విశేషాలు :*

'గీతలోని రెండవ అధ్యాయంలోని 22,23,24,25 శ్లోకాల సంగ్రహానువాదం ఈ అన్నమయ్య కీర్తన. దేహము కలిగిన ఆత్మ (=దేహి) శాశ్వతమైనది. దేహము అశాశ్వతమైనది. కోరికలతో (=ఈహల) రగిలే ఓ మనసా! ఇదెప్పుడు మరిచిపోకు.

1. పాదముల రెండు పక్కల ఉండే బుడుపులకు (=గుది) తాకునట్లుగా పాత బట్టని వదిలి కొత్త బట్టను కట్టుకొన్నట్లు ఈ ఆత్మ-ముసలి శరీరాన్ని విడచిపెట్టి చక్కని (=ఒగి) కొత్త శరీరాన్ని ధరిస్తుంది. సమయం చూసుకొని (=అదన) ఆయుధాలు ఈ ఆత్మని చంపలేవు. సమీపించి (=కదిసి) అగ్ని, నీరు, గాలి ఈ ఆత్మని చంపలేవు.

2. ఈ ఆత్మ నరకబడదు. దీనిని నిప్పు కాల్చలేదు. ఇది నీటిలో మునగదు. ఇది గాలిచేత ఆర్పివేయబడదు. ఇది అన్ని చోట్ల వ్యాపించి ఉంటుంది. దేనిచేత చలించదు. ఇది ఆదిలేనిది. ఉన్నచోటునుంచి కదలదు.

3. దగ్గరగానే (చేరి) ఉంటాడుకాని, ఈ ఆత్మ కంటికి కనబడదు. ఆలోచించటానికి కూడ వీలుకానివాడు. గర్భంలో ఉండటం, పుట్టటం, పెరగటం, మార్పు చెందటం, క్షీణించటం, నశించటం-అను ఆరు రకములైన బరువయిన ఆరు వికారాలు లేనివాడు-ఈ ఆత్మ. అయితే ఈ ఆత్మ శ్రీవేంకటేశుని ఆధీనంలో ఉన్నది. ఈ సారం తెలియటమే సత్యము, జ్ఞానము.

అంతఃకరణం ఒక్కటే. దాని వృత్తులనుబట్టి దానిని నాలుగు విధాలుగా పిలుస్తారు. సంకల్పించేది మనస్సు. నిశ్చయించేది బుద్ధి. గర్వంతో అహంకరించేది అహంకారం. స్మరించేది చిత్తం. ఈ గీతంలో స్మరించిన 'మనసా!' అనే సంబోధన – సంకల్ప వికల్పాత్మకమైన మనస్సును ఉద్దేశించి చేసినదిగా భావించవచ్చు. ఆత్మ ఎలాంటిదో ఒకసారి స్మరించుకొంటూ – ఈ జీవాత్మ – వేంకటేశ్వరుని అదుపులో ఉంటాడు కనుక అతనిని ఎల్లప్పుడు స్మరించమని ఈ గీతంలో మనస్సుకు ఉపదేశిస్తున్నాడు అన్నమయ్య.

ఆత్మ ఒక శరీరాన్ని వదిలి మరొక శరీరాన్ని ధరిస్తుంది అని చెప్పిన గీతాచార్యుడు, తర్వాత కర్మ, భక్తి, జ్ఞానయోగాలు మొదలైనవి వివరించాడు. శరీరాలు మార్చే ఆత్మ స్వభావాన్ని – కర్మ, భక్తి, జ్ఞానయోగాల మెట్లను నెమ్మదిగా ఎక్కుతూ మార్చుకోవచ్చు. స్వామిని శరణువేడి ఆయనలో లీనమై, జనన మరణ చక్రం నుంచి తప్పుకోవచ్చు. ఈ సారాన్ని చివరి చరణంలో పేర్కొంటూ ఇదే సత్యం, జ్ఞానం, అన్నాడు కవి. ఈ విధంగా తైత్తిరియోపనిషత్తులోని ప్రసిద్ధ వాక్యాన్ని 'సత్యం, జ్ఞానమనంతం బ్రహ్మ (2.1.1) వాక్యాన్ని స్మరించాడు. దేహి (జీవాత్మ) ఏకవచనంలో. దేహాలు బహువచనంలో కవి ప్రయోగించటం గమనార్హం. ఇది మూలంలోని 'శరీరాణి' కి యథాతథానువాదం. 84 లక్షల శరీరాలలో కర్మఫలాన్ని అనుసరించి జీవాత్మ తిరుగుతుందని అని ఒక అర్థం. కారణ, సూక్ష్మ, స్థూల శరీరాలని ఇంకొక అర్థం. మరణానికి ముందున్న మన శరీరం కారణ శరీరం. చనిపోయేముందు మన సంకల్పాన్ని అనుసరించి ఏర్పడేది సూక్ష్మ శరీరం. సూక్ష్మ శరీరానికి తగిన విధంగా ఏర్పడేది స్థూల శరీరం. ఈ మూడు శరీరాలను గుర్తు చేయటానికి కూడా 'దేహాలు' అనికవి బహువచనం వాడాడు.

వస్త్రాన్ని అన్నమయ్య 'చీర' అంటే, ఆయన ఆత్మ – పెద తిరుమలయ్య – (ఆత్మా వై పుత్రనామాసి) 'కోక అన్నాడు. పదాలు అర్థ విపరిణామం చెందుతుంటాయి. మనం ఈ రోజు 'కంపు' అని వాడే పదాన్ని మంచి సువాసన అనే అర్థంలో పూర్వ కవులు ప్రయోగించారు. కనుక మన జీవన శైలికి అనుగుణంగా భాషలో మార్పును ఆహ్వానించాలి. ఆరోజు వాడిన అర్థంలోనే ఈ రోజు వాడతానంటే – అది అర్థ రహితం.

దేవుడనే భావనని 'శుమైతాంగి' అనే పదంతో కొందరు నాస్తికులు వాడుతుంటారు. ఒక ఆరడుగుల రాతి స్తంభం అడవిలో అక్కడక్కడ నెలకొల్పుతారు. దీనికి రెండు మూడు మెట్లు కూడ ఉంటాయి. అడవిలో కట్టెలు మోసే వాళ్లు దారిలో విశ్రాంతికోసం ఈ రాతి స్తంభాల దగ్గర ఆగి తమ ఎత్తుకు తగినట్లుగా బరువును కొద్దిసేపు ఆ స్తంభం మీద ఉంచి విశ్రాంతి తీసుకొని తాత్కాలికంగా ఆనంద పడుతుంటారు. ఈ ఏర్పాటునే 'శుమైతాంగి' అనే పదంతో నాస్తికులు వాడతారు. దేవుడనే భావన శుమైతాంగి వంటిదని నాస్తికులంటారు. ఆస్తికులు ఆదే భావనని పరమ పవిత్రంగా భావిస్తారు. తమ బరువు బాధ్యతలన్నీ నిరంతరం స్వామివారిమీదే మోపి, తమ విద్యుక్త కర్మలని నిష్కామ వృత్తితో చేస్తుంటారు. 'కోరికలలో పడి కొట్టుకోవద్దు' అని పదేపదే తమకు తామే చెప్పుకొంటూ, నిగ్రహించుకొంటూ, పరమాత్మీయులుగా, ఆత్మ తత్వాన్ని ఆవిష్కరించుకొంటూ, దైవప్రచారం చేస్తూ కాలం గడుపుతారు.

ఆత్మని తెలుసుకోవటం, చింతించటం, చూడటం అసాధ్యమంటూ – ఇష్టమయిన శ్రీవేంకటేశుని ధ్యానించు. ఆ అసాధ్యం – సుసాధ్యమవుతుందని గీతాచార్యుని వాక్కు, మార్గం దైవమే. మార్గం చూపించేవాడూ దైవమే.

# 15. నగవులు నిజమని నమ్మేదా

నగవులు నిజమని నమ్మేదా
వొగి నడియాసలు వొద్దనవే

1. తొల్లిటి కర్మము దొంతులనుండగ
చెల్లబో యిక జేసేదా
యెల్ల లోకములు యేలేటి దేవుడ
వొల్లనొల్ల నిక నొద్దనవే

2. పోయిన జన్మము పొరుగులనుండగ
చీయనక యిందు జెలగేదా
వేయినామముల వెన్నుడ మాయలు
వోయయ్య యిక నొద్దనవే

3. నలి నీనామము నాలికనుండగ
తలకొని యితరము దడవేదా
బలు శ్రీవేంకటపతి నిన్ను గొలిచి
వొలుకు జెంచలములొద్దనవే

(తా.ప.సా.04-353)

## భగవద్గీతా శ్లోకం

కర్మణ్యేవాధికారస్తే
మాఫలేషు కదాచన
మా కర్మ ఫల హేతుర్భూః
మాతే సంగో స్త్వఽకర్మణి

(గీ. 02-47)

---

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

......మోక్షాధికారియైన నీకు, మోక్ష విరోధము గాని కర్మమందు, అధికారం గలుగని ఫలమందు వకప్పుడున్ను అధికారం వల్దు. కర్మము చేశేవాడేను ఫలం అనుభ వించేవాడు గనుక, ఆ రెంటికి కారణమనే బుద్ధి వల్దు. యింతకంటే ఆ కర్మమే మానుమంటివా? కర్మము మానరాదు.

(పుట-41)

---

***భావ విశేషాలు :***

'ఓ వేంకటేశుడా! కర్మల ఫలితంగా -ఆనందంతో -వచ్చే నవ్వులు నిజమని, (శాశ్వతమని) నేను చేసే ప్రతి కర్మ ఆనందదాయకమని నమ్మమంటావా!? వద్దు స్వామీ! ఆ నవ్వులు నాకు వద్దు. క్రమంగా (=ఒగిన్) దురాకర్షణలు (=అడి ఆసలు) నాలో పుట్టకుండా చేయవయ్యా!

1. పూర్వ జన్మలలో నేను చేసుకొన్న కర్మలు ఒకటి మీద ఒకటిగా ఉంచిన కుండల వరుసగా చాలా ఉన్నాయి. ఫలితాలనుభవించటానికి అవి చాలులే. మళ్లీ కొత్త కర్మ చేయమంటావా! అన్ని లోకాలను పరిపాలించే స్వామీ! కొత్త కర్మలు చేయటం, మళ్లీ దొంతులు పెరిగిపోవటం- ఇకచాలు. ఇకచాలు. కోరికలు నాలో కలుగనీయకు. అప్పుడు కర్మ చేయవలసిన అవసరం రాదు.

2. నేను క్రితంసారి కర్మల ఫలితంగా జన్మ అనుభవించిన విషయం నా మనస్సుకు చాలా దగ్గరలో ఉన్నది. అది మరిచిపోకుండా ఈ జన్మలో మళ్లీ కోరికలు తీర్చుకోవటానికి కర్మలు చేయటానికి చెలరేగిపోవాలా! ఛీ! ఛీ!

3. జన్మరాహిత్యం కలుగజేసే యోగ్యమైన (=నలి) నీ పేరు నా నాలిక మీద ఉండగా, ప్రయత్నించి మరో జన్మను కలుగజేసే ఇతరమైన కోర్కెల గూర్చి, కర్మలగూర్చి ఆలోచించేదా? (=తడిమేదా)! శ్రీవేంకటేశ్వరా! బలవంతుడవైన (=బలు) నిన్ను ఎప్పుడు తలుస్తుంటాను. మనస్సును స్థిరంగా ఉండనీయకుండా చిందులేసే (=వొలుకు) చంచలములైన కోరికలను నా దగ్గరకు రానీయకుండా చూడవయ్యా!

కర్మలను గూర్చి రకరకాల వ్యాఖ్యానాలు మనం చదువుతుంటాం. గీతాచార్యుడు కర్మలపై సాధికారికంగా చెప్పిన 'కర్మణ్యేవాధికార.....' శ్లోకాన్ని అన్నమాచార్యుడు ఈ గీతంలో వివరిస్తూ అనుసృజన చేసాడు.

కర్మబంధాలపై మొదటి రెండు చరణాలలో స్వామితో ముఖాముఖిగా చర్చించాడు. మూడో చరణంలో 'నువ్వు చెప్పిన పద్ధతే బాగుంది. నానాలుక మీద నీ పేరు ఉంది. నీ పవిత్రమైన నామాన్ని జపించటమే నా కర్మ. ఇక నాకు ఫలితాలతో సంబంధంలేదు. ఏవేవో కోర్కెలు చిందులేస్తుంటాయి. వాటిని కట్టడి చేసే బాధ్యత నువ్వు చూసుకో. నా జప కర్మను నేను చేస్తూ అన్ని చోట్లా నిన్ను దర్శిస్తుంటాను' అని అన్నమయ్య చమత్కరించాడు.

'కోర్కెలు చిందులేస్తుంటే, వాటిని తీర్చుకోవటం కోసం కర్మలు చేయాలి. మళ్లీ కర్మ ఫలితాలను అనుభవించటానికి జన్మలెత్తాలి. ఇన్ని బాధలు నేను పడలేను కాని, కర్మలకు కారణమైన కోర్కెలను నా దగ్గరికే రానీయకు.' అని తనను కాపాడే బరువును స్వామి వారిమీదే భక్తుడు పెట్టాడు. స్వామివారు బరువులు మోయగలడని అందరికి చెప్పటానికి 'బలవంతు' డని ఒక ధ్రువపత్రం కూడ కవి ఇచ్చాడు.

ఈ గీతం ఎత్తుగడలో ప్రయోగించిన నగవులు భౌతికంగా లభించే ఆనంద సంకేతాలు. ఉద్యోగం దొరికింది. ఆనందమే. కాని అది అనేకమైన మంచి, చెడు, కర్మలు చేయిస్తూ బంధాలలో కట్టిపడేస్తుంది. ఈరకంగా భౌతికంగాలభించే ఏ ఆనందం నిజంకాదు. నిజంలా కనబడే అబద్ధం.

అడియాశ – అంటే దుష్కర్మలో ప్రయత్నింపచేయటానికి చేసే ప్రయత్నం. దురాకర్షణ (టెంప్టేషన్). ఈ దురాకర్షణలను అన్నమయ్య నిరసిస్తున్నాడు.

కర్మానుష్ఠానులు నలుగురు.

1. కర్మాతీతులు : జ్ఞానాగ్నిచే కర్మ దగ్ధమైనవారు.( జీవన్ముక్తులు)
2. నిష్కామ కర్మానుష్ఠానులు : కోరికలు లేకుండా కర్మ చేసేవారు (ముముక్షువులు)
3. కామ్య కర్మానుష్ఠానులు : కోరికలతో కర్మలు చేసేవారు
4. కర్మ భ్రష్ఠులు : ధర్మము, పుణ్యము, పాపము లేక స్వేచ్ఛగా తిరుగువారు.

అన్నమయ్య ఈ గీతంలో ముందు మనలని ముముక్షువులు కమ్మంటున్నాడు. ఆ తర్వాత జీవన్ముక్త దశ తదనుబంధంగా తప్పనిసరిగా వస్తుంది.

కర్మలను చేయుట ఎవరూ తప్పించుకోలేరు. (గీత03-33)

మనకు ఇష్టము లేని కర్మ కూడ – పూర్వ జన్మలో చేసుకొన్న సంస్కార ప్రభావంతో – తప్పనిసరిగా చేస్తాం. (18-60). అన్ని కర్మలను స్వామివారికే అర్పించి తనను నిండు మనస్సుతో శరణుకోరేవారిని కర్మ బంధంనుంచి స్వామి విముక్తి చేస్తాడు. (18-57). ఇవి గీతలో కర్మను గురించి చెప్పిన అమృత గుళికలు. ఈ గీతా సారాంశాన్ని తన కీర్తనలో అన్నమయ్య 'నలి నీనామము నాలికనుండగ / తలకొని యితరము దడవేదా' అని పొందు పరుస్తూ – స్వామి వారిని శరణు వేడి కర్మలనుంచి విముక్తి పొందమని మనకు ఉపదేశించాడు. ఈ మాట వినని వాళ్లది నిజంగానే 'ఖర్మ'.

## 16. నీవు సర్వ సముడవు

నీవు సర్వ సముడవు నీవు దేవ దేవుడవు
యీవల నా గుణదోషాలెంచనికనేలా

1. పూవులపై గాసీ బోరి ముండ్లపై గాసీని
ఆవల వెన్నెలకేమి హాని వచ్చీనా
పావనుల నటుగాచి పాపపుంజమైన నన్ను
గావగ నీకృపకును గడమయ్యీనా

2. గోవు మీద విసరీ గుక్క మీద విసరీని
పావనపు గాలికిని పాపమంటీనా
దేవతల రక్షించి దీనుడనైన నాకు
దోవ జూపి రక్షించితే దోసమయ్యీనా

3. కులజుని యింటనుండీ కులహీనుని యింటనుండి
యిలలో నెండకు నేమి హీనమయ్యీనా
వలసి శ్రీవేంకటాద్రివరములు యిచ్చి నాలో
నిలిచి వరములిచ్చి నేడు గావవే

(తా.ప.సా.02-129)

### భగవద్గీతా శ్లోకం

సమోహం సర్వ భూతేషు
నమే ద్వేష్యోస్తి న ప్రియః
యే భజంతి తు మాం భక్త్యా
మయి తే తేషు చాప్యహమ్

(గీ. 09-29)

---

### పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం

...సర్వభూతాలందున్నూ సముడను. నాకు పగవారూన్నూ లేరు. ప్రియులూన్ను లేరు. యెవ్వరైన నేమి భక్తిచాతను నన్ను భజియింతురు, వారు యే జాతివారైనాను నాయందే భక్తి గలవారు; వారందున్నూ నేను దయగలిగి వుండుదును.

(పుట-169)

---

***భావ విశేషాలు :***

'స్వామీ! వేంకటేశ్వరా! నువ్వు అందరిని సమానంగా చూసేవాడివి. నువ్వు దేవతలకే దేవుడివి. అటువంటి వాడివి - ఇవతల (=ఈవల) ఉంటున్న నా తప్పు, ఒప్పులను లెక్కించటమెందుకయ్యా! (నా తప్పొప్పులను పట్టించుకోక రక్షించమని భావం)

1. వెన్నెల పూవులమీద కాస్తుంది. క్రమంగా (=పోరి) ముండ్లమీద కాస్తుంది. పూవుల మీద కాయాల్సిన వెన్నెల అవతల (=ఆవల) ఉన్న ముండ్ల మీద కాసినంత మాత్రాన ఆ వెన్నెలకేమైనా గొప్పతనం తగ్గిందా? దయామయుడవైననీ చల్లని చూపుల వెన్నెల పవిత్రుల మీద ప్రసరించి కాపాడుతుంది. అలాగే పుణ్యానికి అవతల తీరంలో ఉన్న ఈ పాపాల భైరవుడిమీద ప్రసరించినంత మాత్రాన నీ చల్లని చూపుల వెన్నెలకు లోటు రాదులేవయ్యా!

2. పవిత్రమైన గాలి - ఆవు మీద, కుక్కమీద ఒకేరకంగా వీస్తుంది. అంతమాత్రాన పవిత్రమైన గాలికి పాపమంటుతుందా!? అలాగే దేవతలను కాపాడే నీ దయా మారుతం - దీనుడిని - హీనుడిని అయిన నామీద కూడ తాకించిఈ జీవితానికి ఒక చక్కని మోక్ష మార్గం చూపించవయ్యా! అలా చేసినంత మాత్రాన నీకేమి దోషం రాదులేవయ్యా!

3. ఈ లోకంలో (=యిల) మంచి కులంలో పుట్టిన వాడి యింటిలోను, తక్కువ కులములో పుట్టిన వాడి యింటిలోను ఎండ - భేదభావం లేకుండా ఒకే రకంగా కాస్తుంది. అంతమాత్రాన

ఎండకు గొప్పతనం ఏమన్నా పోతోందా!? ఎక్కడో – వైకుంఠంలో ఉండవలసిన వాడివి – మా మీద – దయతో – ఈ వెంకటాద్రి మీద కలిసిపోయి (=వలసి) వెలుగులు కురిపించే వరాలు ఇస్తున్నావు. వరాలివ్వటంకోసం అంత ఎత్తునుంచి కిందికి దిగి వచ్చావు. అందువల్ల కింది స్థాయిలో ఉన్న నాకు కూడ వరాలు ఇచ్చి రక్షించటం నీ ధర్మం.

సమం సర్వేషు(13–27), సమం పశ్యన్ (13–28) ఇటువంటి అనేక గీతాశ్లోకాల్లో స్వామిని సర్వ సముడిగా భగవద్గీత నిరూపించింది. ఆ సర్వసముడిని అన్నమయ్య వెన్నెలగా, గాలిగా, వెలుగుగా అన్నమయ్య ఈ గీతంలో పోల్చాడు. వెన్నెల, గాలి, వెలుగు రూపాలలో ఉన్న నువ్వు – సర్వసమానత్వం చూపిస్తున్నావు. నన్ను మాత్రం అందరితో సమానంగా చూస్తూ రక్షించటంలేదని స్వామివారిని చనువుతో ప్రశ్నిస్తున్నాడు కవి.

అందం, విద్య, కులం – ఇలాంటివాటితో సంబంధం లేకుండా – తనను భక్తితో శరణు వేడినవారిని స్వామి సమంగా ఆదరిస్తాడని రామానుజాచార్యులవారు ఈ శ్లోకానికి భాష్యం రాస్తూ వివరించారు. దీనిని మనం పెద తిరుమలయ్య అనువాదంలో గమనించాం. ఈ కులమతాలకు అతీతమైన స్వామి కరుణను అన్నమయ్య ఈ గీతంలోని మూడో చరణంలో ప్రస్తావించాడు.

'అవతల వైపు ఉండి ఎన్ని కబుర్లు అయినా చెప్పచ్చు. ఒక్కసారి ఇవతలికి రా! నీకు తెలుస్తుంది' అని మనం నిత్య సంభాషణల్లో అప్పుడప్పుడు వాడుతుంటాం. ఆ జాతీయాన్ని అన్నమయ్య ఇక్కడ ప్రయోగించాడు. 'నువ్వేమో గుణ దోషాలంటని నిర్వికార నిశ్చల స్థితిలో చక్కగా ఉన్నావు. ఇవతల మా మానవులం ప్రతి నిత్యం కర్మ పాశ బద్ధులమై, తప్పనిసరిగా గుణ దోషాలంటుకొనే దశలో ఉన్నాం. శుభ్రతని, బురదని ఒకేలా చూసే సమబుద్ధి ఉన్న దేవా! మా దోషాలు పట్టించుకోకుండా కాపాడవయ్యా!' – అనే అర్థం రావటం కోసం – ఈవల పదాన్ని అన్నమయ్య వాడాడు.

పువ్వు మీద, ముల్లు మీద వెన్నెల సమానంగానే కాస్తుంది. వెన్నెల చల్లదనాన్ని నింపుకొంటూ పువ్వు ఇంకా రమ్యంగా ప్రకాశిస్తుంది. కాని ముల్లు – చల్లదనం – తనమీదకు వచ్చి వాలుతున్నా – తన కఠినత్వాన్ని మానుకోదు. స్వామి దయ మనందరిమీద సమానంగా ప్రకాశిస్తున్నా – మన స్వభావాన్ని అనుసరించి ఆ దయను స్వీకరిస్తాం. స్వభావో హి దురతి క్రమః (అనేక జన్మల కర్మ ఫలితంగా వస్తున్న ఈ స్వభావాన్ని మార్చుకోవటం చాల కష్టం.) ఇది నిజమేకాని – స్వామిని శరణుకోరితే మన హృదయం – అందరియందు సమాన బుద్ధి ఉన్న స్వామి దయకు అనుగుణంగా మారుతుంది. 'వరములిచ్చి గావవే' అంటూ అన్నమయ్య మనకు దైవాన్ని శరణు వేడమని ప్రబోధం చేసాడు.

'సముద్రం పై గాలి అంతటా వీచుచున్ననూ ఎవరు తెరచాప ఎత్తుదురో వారి పడవయే కదులునుకదా! కావున భగవత్కరుణ అను గాలి సర్వత్ర వీచుచున్ననూ వారివారి హృదయములను తెరచాపలను విప్పి భగవదున్ముఖముగా ఉంచినచో మోక్ష మను గమ్య స్థానమును శీఘ్రంగా చేరగలమని సమోహం శ్లోక వివరణలో శ్రీవిద్యాప్రకాశానంద గిరి స్వామి చెప్పారు. (గీతామకరందం – 695పే) అన్నమయ్య గీతంలోని ఆంతర్యం కూడా అదే!

## 17. పుట్టుభోగులము

పుట్టుభోగులము మేము భువి హరిదాసులము
నట్టనడిమి దొరలు నాకియ్యవలెనా

1. పల్లకీలునందలాలు పడివాగె తేజీలు
వెల్లవిరి మహాలక్ష్మీ విలాసములు
తల్లి యాకె మగనినే దైవమని కొలిచేము
వొల్లగే మాకే సిరులు వొరులియ్యవలెనా

2. గ్రామములు రత్నములు గజముఖ్య వస్తువులు
ఆమని భూకాంతకు నంగభేదాలు
భామిని యాకె మగని ప్రాణధారి లెంకలము
వోమి మాకాతడే యిచ్చీ వొరులియ్యవలెనా

3. పసగల పదవులు బ్రహ్మ నిర్మితములు
వెస బ్రహ్మ తండ్రి శ్రీవేంకటేశుడు
యెసగి యాతడే మమ్ము నేలి ఇన్నియు నిచ్చె
వొసగిన మా సొమ్ములు వొరులియ్యవలెనా

(తా.ప.సా.04-94)

**భగవద్గీతా శ్లోకం**

యేహి సంస్పర్శజా భోగా
దుఃఖయోనయ ఏవ తే
ఆద్యంతవంతః కౌంతేయ
న తేషు రమతే బుధః

(గీ. 05-22)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

విషయ సంస్పర్శలవలన బుట్టెడి భోగాలు ఏమి గలవు, అవి (అ) స్థిరాలై, దుఃఖకారణాలయ్యే వుండును. వానియందు వివేకం గలవాడు రమింపడు.

(పుట-101)

*__భావ విశేషాలు :__*

'ఓ రాజులారా! మేము పుట్టుకతోనే భోగము కలవారము. విష్ణు భక్తులము. మా దొర విష్ణువు ఆదిలోను, అంతములోను ఉండే శాశ్వతమైన దొర. మీరు పుట్టుక చావుల మధ్య కాలంలో - ఉన్న అశాశ్వతులైన దొరలు. మీకు - మాకు - సంపదలు ఇచ్చే శక్తిలేదు. మీరు అంత గొప్పవారు కారు.

1. పల్లకీలు, అందలాలు (=పక్కలను కప్పులేక కుర్చీవలె ఉండు వాహనాలు), పడివాగెలు (=పవిత్రములైన గుర్రాలు) తేజీలు (=మంచి జాతి గుర్రాలు) - ఇటువంటి సంపదలన్నీ తెల్లటి పువ్వును ధరించిన మా అమ్మ మహా లక్ష్మీ విలాసాలు. (ఎప్పటినుంచో మా అమ్మ దగ్గర ఉన్న- అంటే మా దగ్గర ఉన్న సంపదలు - వీటిని - కొత్తగా ఇస్తామంటారేమిటి? అని భావం) సంపదలను అనుగ్రహించే ఆమె (=అకె) మగనిని-వేంకటేశుని దైవమని కొలిచేవాళ్లము. చాలు చాల్లే (=వొల్లగే)! అటువంటి మాకు ఇతరులు సంపదలు ఇవ్వనవసరంలేదు. ఇచ్చే స్థాయి వాళ్లకు లేదు.

2. ఏమిటంటున్నారు! గ్రామాలు, రత్నాలు, మంచి జాతి ఏనుగులు, వస్తువులు - ఇవి ఇస్తామంటున్నారా! మీరు చెప్పినవన్నీ వసంత రుతు శోభలతో ఉండే-మా తల్లి భూదేవి అంతర్భాగాలు (=అంగభేదాలు) మా దగ్గర ఉండే వస్తువులు గొప్పగా మాకు ఇస్తున్నట్టు చెబుతారేమిటి? ఆ భూదేవి మగడు శ్రీవేంకటేశుడు ఎవడనుకొంటున్నారు. సంపదలన్నింటిని మించిన సృష్టిలోని ప్రాణాలన్నీ (=జీవులను) ధరించినవాడు. మేము అతని సేవకులము. మమ్మల్ని కాపాడుతూ ఇప్పటికే (=వోమి) మాకు ఆ స్వామి ఎన్నో విశిష్టమైన అక్షర సంపదలు ఇచ్చాడు. ఇతరులు మాకు ఇవ్వనవసరంలేదు.

3. పదవులు ఇస్తారా?! మీకు తెలుసా! పసగల పదవులన్నీ బ్రహ్మ సృష్టించినవి. వేగంగా (=వెస)సృష్టి చేయగల సామర్థ్యం ఉన్న –ఆ బ్రహ్మకు తండ్రి మా శ్రీవేంకటేశ్వరుడు. ఆ వేంకటేశ్వరుడే కొండమీద ప్రకాశిస్తూ (=యెసగి), మమ్మలిని పరిపాలిస్తూ ఎన్నెన్నో పదవులు (=కీర్తనలనే మార్గాలు) మాకు ఇచ్చాడు. అతడు మాకిచ్చిన మా సొమ్ములు, మళ్లీ పరాయివారు (=వొరులు) కొత్తగా ఇవ్వనవసరంలేదు.

---

ఇంద్రియాలకు సంతోషము కలిగించే ప్రతి భోగం – దుఃఖాన్ని కలిగిస్తుందని చెప్పిన భగవద్గీత వాటిని మొదలు – తుది కలవి అని చెప్పింది. (గీత 05–22) అంటే శాశ్వతం కావని భావం. అందుకే అశాశ్వతములైన ఆ భోగాలను నిఖార్సయిన ప్రతిభక్తకవి తిరస్కరించాడు. రాముని వారము మాకేమి విచారము, నిధి చాల సుఖమా? రాముని సన్నిధి సుఖమా!? (త్యాగరాజు) – ఇలా ఎందరెందరో భక్తకవుల తిరస్కారాలకు ఒజ్జబంతి అన్నమయ్య 'పుట్టుభోగులము' భావన.

అష్టైశ్వర్యాలలో (1. దాస, 2. భృత్య 3. సుత, 4. బంధు, 5. వస్తు 6. వాహన, 7. ధన, 8. ధాన్యాలు) వాహనాలను మొదటి చరణంలో అన్నమయ్య తిరస్కరించాడు. ఇదివరకటిరోజుల్లో వాహనాలంటే పల్లకీలు, అందలాలు, గుర్రాలు, ఏనుగులు మొదలైనవి. అందుకనే వాటిని ప్రస్తావిస్తూ, అవన్నీ అమ్మవారి విలాసాలు అన్నాడు కవి. లక్ష్మీ అష్టోత్తర నామావళిలో 'శుక్ల మాల్యాంబరా' అని లక్ష్మీ దేవినివర్ణించారు. తెల్లటి పువ్వును ధరించిన అమ్మను –స్మరించుకొంటూ ఆమె విలాసాలు ఈ వాహనాలు అన్నాడు కవి. ప్రియుణ్ని చూడటంతో స్త్రీకి కలిగే కటాక్ష భ్రూవికారాదులను విలాసమంటారు. అంటే – లక్ష్మీ విలాసాలలో ఈ వాహనసౌభాగ్య లక్షణాలున్నాయని కవి అభిప్రాయం.

వేంకటేశ్వరునికి ఇద్దరు భార్యలుగా – శ్రీదేవి, భూదేవి ప్రసిద్ధులు. స్వామివారికి కూడ ఇద్దరు భార్యలు – అంటూ – లోకంలోని ఒక భర్త – ఇద్దరు భార్యల సంబంధాలను స్వామి వారికి అంటగట్టడం మహా పాపం. దీనివెనకాల ఒక వేదాంత రహస్యముంది. శ్రీదేవి, భూదేవులలో ఒకరు అపరా ప్రకృతి. రెండవ వారు పరా ప్రకృతి. అష్టైశ్వర్యాలు, కామము మొదలైన అరిషడ్వర్గాలు, మనో చిత్తాహంకారాలు – వెరసి అపరా ప్రకృతి. ఈమే శ్రీదేవిగా దర్శనమిస్తోంది. ఇది పరమాత్మ స్వభావ ప్రకృతి. రెండవది పరమాత్మ స్వరూప ప్రకృతి. మనలో ఉండే చైతన్యంలేక ప్రాణం. ఇది పరా ప్రకృతి. ఈమె భూదేవిగా దర్శనమిస్తోంది. బ్రహ్మ వేత్తకు బ్రహ్మ జ్ఞానాన్ని కలుగజేసి, లోక వ్యవహారమందుండే పరాపర ప్రకృతులకు సంకేతాలుగా శ్రీదేవి, భూదేవులను అర్థం చేసుకోవాలి. బ్రహ్మ జ్ఞానం మనకు కలగటం కోసమే పర బ్రహ్మం (వేంకటేశ్వరుడు) పక్కనే ఈ పరాపర ప్రకృతులున్నాయి.

కష్టమయిన ఆధ్యాత్మిక రహస్యాలను గ్రహించటానికి, చాలా తేలికయిన మనకు అర్థమయ్యే సంబంధాలు, ఊహలు, మహానుభావులు దేవుళ్లయందు ఆరోపిస్తుంటారు. వాటిని దాటి తత్వాన్ని తెలుసుకొన్నవాడు అన్నమయ్యలా లౌకిక వాంఛలను దాటి పోయి స్వామిదాసులమైన మేము పుట్టుభోగులము అని నిర్ద్వంద్వంగా ప్రకటించి, భోగాలయందు అమితాపేక్షతో అజ్ఞానంలో ఉన్న మనల్ని చైతన్య పరుస్తుంటారు. ఈ కీర్తనలో అధ్యాత్మికంగా – స్వామి భక్తులు ఎంత 'ఐశ్వర్య వంతు' లో చెబుతూ, లౌకికంగా సంపదల కోసం అడ్డమయిన పనులు చేస్తూ – దేబిరించకూడదని అన్నమయ్య ప్రబోధించాడు.

## 18. పురుషోత్తముడ నీవు

పురుషోత్తముడ నీవు పురుషాధముడ నేను
ధరలో నాయందు మంచితనమేది

1. అనంతాపరాధములు అటు నేము సేసేవి
అనంతమైన దయ అది నీది
నిను నెరగకుండేటి నీచగుణము నాది
నను నెడయకుండే గుణమునీది

2. సకల యాచకమే సరుస నాకు బని
సకల రక్షకత్వము సరి నీ పని
ప్రకటించి నిన్ను దూరే పలుకే నాకెప్పుడూను
వెకలివై నను గాచే విధమునీది

3. నేరమింతయును నాది నేరుపింతయును నీది
సారెకు నజ్ఞాని నేను జ్ఞానివి నీవు
ఈ రీతి శ్రీవేంకటేశ యిట్టే నన్ను నేలితివి
ధారుణిలో నిండెను ప్రతాపము నీది

(తా.ప.సా. 02-53)

**భగవద్గీతా శ్లోకం**

యో మామేవ మసమ్మూఢో
జానాతి పురుషోత్తమమ్
స సర్వ విద్భజతి మాం
సర్వ భావేన భారత

(గీ. 15-19)

---

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

..............వాడు పురుషోత్తముడని (ని)నన్ను యెరుగును. వాడు సర్వమున్నూ జ్ఞానమున్నూ యెరిగిన వాడై, యో భారతుండా! సమస్తమైన భావాలున్నూ నన్నే భజించును.

(పుట-274)

---

***భావ విశేషాలు :***

'స్వామీ! నువ్వు పరమేశ్వరుడవు (పురుషోత్తముడ నీవు). నేను పనికిమాలిన జీవుడను. ఈ భూమిలో ఎక్కడ వెతికినా నాలాంటి జీవులలో ఎక్కడా మంచితనము లేదు.

1. ఒకటా! రెండా! నేను లెక్కలేనన్ని అపరాధాలు చేస్తూనే ఉంటాను. అయినా నువ్వు అపారమైన నీ దయతో నన్ను ఎప్పుడూ రక్షించి కాపాడుతూనే ఉంటావు. నిన్ను తెలుసుకోలేని నీచ గుణం నాది. అయినా నన్ను విడిచి పెట్టని మంచి గుణం నీది.

2. ఒకరిని కాదు. ఇద్దరినికాదు. పనికిమాలిన వాళ్లందరిని అడుక్కోవటమే నా పని. అంతేకాదు. నీ పక్కన ఉండ కుండా వాళ్ల పక్కన (=సరుస) ఉండటమే నా పని. అందరిని రక్షించటం నీకు యుక్తమైన (=సరి) పని. ఎప్పుడు అవకాశం వస్తే అప్పుడు నలుగురికి తెలిసేటట్లుగా ప్రకటించి నిన్ను తిట్టటమే నాకు ఎప్పుడూ ఉండే పని. ఆసక్తి కలిగిన వాడివై - (=వెకలివై) నన్ను రక్షించే పద్ధతి నీది.

3. నేరమంతా నాది. నేరుపంతా నీది. నేను మాటిమాటికి (=సారెకు) చేసే ప్రతి పనిలోను అజ్ఞానిగా అందరికి తెలుస్తుంటాను. నువ్వు జ్ఞానిగా నిరూపితమవుతుంటావు. ఇలా నీచంగా ఉన్నప్పటికీ - నన్ను వదిలేయకుండా నన్ను ప్రతి విషయంలోనూ పరిపాలిస్తున్నావు. ఈ భూమిలో నీ తేజస్సంతా (=ప్రతాపము) నిండి పోయింది.

భగవద్గీతలోని పురుషోత్తమ యోగం (15వ అధ్యాయం) సుప్రసిద్ధం. పురుషోత్తముడనే పదానికి కృష్ణ భగవానుడు స్వయంగా అర్థం చెప్పాడు. ప్రకృతికి మరో పేరు క్షరం. జీవునికి మరోపేరు అక్షరుడు. క్షరమునకు అతీతుడిని. అక్షరునికి మించినవాడిని కనుక తన పేరు పురుషోత్తముడని స్వామి వివరణ. (గీత15-18శ్లో)

వైష్ణవుడు - దేవుని ముందు తనని అయోగ్యునిగా, ప్రాముఖ్యం లేనివానిగా, నిరాశ్రయునిగా గడ్డి చివరిభాగం కంటే తక్కువవానిగా భావిస్తాడు. (worthless, insignificant, destitute and lower than a blade of grass." -Bhaktivedanta Narayana Gosvami maharaja, Jaiva Dharma Page 205.) దీనికే నైచ్యానుసంధానం అనిపేరు. దీనివల్ల అహంకార, మమకారాలు తగ్గిపోతాయని వైష్ణవులు భావిస్తారు. ఈ భావనలనే అన్నమయ్య ఈ కీర్తనలో పేర్కొన్నాడు.

పురుషుడు అంటే జీవుడు అని ఇంకో అర్థముంది. అందువల్ల 'పురుషాధముడను' అంటే జీవులలో అధముడను అని అర్థం చెప్పుకోవచ్చు. 'నేను చేసిన తప్పులన్నింటిని క్షమించవయ్యా!' అని దేవునియెదుట మొరపెట్టుకోవటం భగవద్గీతలో కనిపిస్తుంది. (గీత 11-42) కొడుకును తండ్రి క్షమించినట్లు, మిత్రుని మిత్రుడు క్షమించినట్లు, భార్యను భర్త క్షమించినట్లు నా అపరాధాలను నువ్వు క్షమించవయ్యా!' అని అర్జునుడనే జీవుడు దేవునికి మొరపెట్టుకొన్నాడు. దీనినే అన్నమయ్య 'అనంతమైన దయ అది నీది'-అంటూ దయాశాలియైన స్వామిని కాపాడమని వినయంగా, వ్యంగ్యంగా కోరాడు.

వ్యక్తిత్వ వికాస పరంగా ఆలోచిస్తే - ఆత్మనింద అంత మంచిది కాదనిపిస్తుంది. 'నేనింతే.. పనికి మాలిన వాణ్ని.... దేనికి పనికిరాను. నాకేమి చేతకాదు. అందరూ నాకంటే గొప్పవారు... నేను నీచుడిని' ఈ రకమైన ఆలోచనా ధోరణిని ఆత్మ న్యూనత అంటారు. 'మహినుద్యోగి కావలె మనుజుడైనవాడు' మొదలైన ఎన్నెన్నో అమూల్యమైన వ్యక్తిత్వ వికాస పాఠాలు నేర్పిన అన్నమయ్య తనని తాను కించపరుచుకొనే గీతం ద్వారా మనకు ఏమి నేర్పుతున్నాడనేది ప్రశ్న. మానవులముందు మనల్ని మనం కించపరుచుకొంటే-వాళ్లముందు నిజంగానే వెలితి అయిపోతాం. అదే-దేవునిముందు కన్నీళ్లతో కడిగిన పదాలతో - ప్రార్థనలతో మనల్ని మనం కించపరుచుకొంటే - మనం ఉన్న స్థితి నుంచి - ఉన్నత స్థితిలోకి వెళతామనేది జవాబు.

'పాపోహం..... నేను పాపిని. పాపాత్ముడిని. పాపం చేయటం వలన ఈ జన్మ ఎత్తాను. నన్ను రక్షించు... అంటూ హిందువులలో చాలా మంది దైవం ఎదుట ప్రదక్షిణ చేస్తాం. దాన ధర్మాలు చేసే అనేకమంది పుణ్యాత్ములు కూడ ఈ శ్లోకాన్ని చదువుతారు. మనం తెలిసి పాపం చేసి ఉ ండకపోవచ్చు. కాని మనకు తెలియకుండ మనకు పాప కర్మల ఫలితాన్ని అంటగట్టే అనేక పనులు జరుగుతుంటాయి. వాటినుంచి రక్షించమని దైవానికి ఈ 'పాప' ప్రార్థన.

మనం అనుకొన్నది అప్పుడప్పుడు జరక్కపోతే-' ఆ.... ఏం దేవుడండి.. ఎంతగా పూజ చేసాం.. ఎన్ని ప్రార్థనలు చేసాం. కొంచెమైన ఆయనకు దయ లేదు.. నా కోర్కె తీర్చలేదు." అని సాధారణ మానవులం నిత్య జీవితంలో దైవ దూషణకు వెనుకాడం. దీనినే 'ప్రకటించి నిన్ను దూరే పలుకే నాకెప్పుడూను' అంటూ అన్నమయ్య ఈగీతంలో అంటగట్టాడు.

అన్నమయ్య చెప్పినట్టు మనంతిట్టినా, మనల్ని రక్షించటంలో ఆసక్తి చూపించే దేవుడి ఎదుట - మనల్ని మనం తిట్టుకోవటంలో తప్పులేదు. అది మన పాపకర్మలను పలుచన చేస్తుంది. ఈ గీత సందేశం ఇదే.

## 19. మనుజుడై పుట్టి

మనుజుడై పుట్టి మనుజుని సేవించి
అనుదినమును దుఃఖమందనేలా

1. జుట్టెడు గడుపుకై చొరని చోట్లు చొచ్చి
పట్టెడు గూటికై బతిమాలి
పుట్టిన చోటికై పొరలి మనసు పెట్టి
వట్టి లంపటము వదలనేరడు గాన

2. అందరిలో పుట్టి అందరిలో పెరిగి
అందరి రూపములటు తానై
అందమైన శ్రీవేంకటాద్రీశు సేవించి
అందరాని పదమందెనటుగాన

(తా.ప.సా.01-196)

**భగవద్గీతా శ్లోకం**

అనన్యాశ్చింతయంతో మాం
యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం
యోగ క్షేమం వహామ్యహమ్

(గీ. 9-22)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

యే జనులునైనా నేమి యితర దేవతల గొలువక, కోరికెలు గోరక నన్నే గతి యని గొల్తురు; నిత్యమున్ను నాతోడి యోగమే అపేక్షించేవారి యోగక్షేమం వహించుకొని మోక్షము యిత్తును.

(పుట-165)

*__భావ విశేషాలు :__*

మనిషిగా పుట్టినవాడు ఎవరికి సేవ చేయాలో అన్నమయ్య ఈ కీర్తనలో నిర్దేశిస్తున్నాడు.

మనిషిగా పుట్టావు. నీకంటె గొప్పవాడయిన దేవునికి సేవ చేయకుండా మనిషికి సేవచేస్తూ, కాలాన్ని వ్యర్థం చేస్తూ, ప్రతిరోజు బాధ పడుతున్నావు. ఇది ఎందుకు? (ఇలా తగదని భావం)

1. ఓ మనిషీ! నీ కడుపు ఎంత ?! జుట్టెడు. (=చాపబడిన బొటన వేలియొక్క చూపుడు వేలియొక్క నడిమి ప్రదేశం - చాలా తక్కువ పరిమాణమని భావం) ఈ జుట్టెడు కడుపు నింపటానికి - ఎక్కడికి వెళ్ల కూడదో ఆ ప్రదేశాలకు వెళ్తున్నావు. పాపం మూటగట్టుకొంటున్నావు. పట్టెడు (=ఎడమగా వంచబడిన వేళ్లుగల అరచేయి కొలత) అన్నం కోసం - బతిమిలాడుకొంటున్నావు. ఎక్కడ పుట్టావో, మళ్లీ ఆ జన్మస్థానంకోసం, ఇష్టపడి (=పొరలి), ఆ కామం మీదే మనస్సు పెట్టి పెళ్లి చేసుకొని బాధ్యతలనే పనికిమాలిన బాధల వలలో చిక్కుకొనిపోతున్నావు. సంసారాన్ని వదలలేక పోతున్నావు.

2. ఓ మనిషీ! నేను చెప్పేదివిను. ఆ వెంకట పర్వతంపై కొలువైన ప్రభువైన శ్రీవేంకటేశ్వరుడు మన అందరిలో పుట్టాడు. మన అందరిలో పెరుగుతున్నాడు. (అంతరాత్మ అనిభావం) మన అందరి రూపాలు ఎవరివనుకొంటున్నావు!? ఆయనవే. అటువంటి అందగాళ్లకు అందగాడు శ్రీవేంకటేశుని సేవించు. అందరాని పదమును (= మోక్ష స్థానమును) అందుకో! (మనుష్యులను సేవిస్తే నీకు అందరాని పదము రాదని, శ్రీవేంకటేశుని సేవించుమని ప్రబోధం)

ఇతరుల మీద మనస్సు పెట్టకుండా, నన్నే సేవించవయ్యా! (09–22), మనస్సును ఏ ఇతరమైన వాటి మీద నిల్పకుండా నా మీదే నిలిపిన వానికి (అంటే నన్నే సేవించిన వానికి) నేను సులభుడను (08–14) అని భగవద్గీతలో స్వామి భక్తులకు తన సేవ యొక్క ఆవశ్యకతను తెలియచేసారు. దీనినే అన్నమయ్య "మనుజుడై పుట్టి" గీతంగా మలిచాడు.

అయితే గీతం పల్లవిలోనే 'స్వామిని సేవించు' అని అన్నమయ్య చెప్పలేదు. కాని ఆ అర్థం వచ్చేటట్టు 'మనిషిని సేవించకు' అన్నాడు. మనిషిని సేవిస్తే బాధలు వస్తాయన్నాడు. అంటే దేవుని సేవించమని అన్యాపదేశంగా ప్రబోధం. దీనిని రెండవ చరణంలో 'అందగాళ్లకు అందగాడు శ్రీవేంకటేశు ని సేవించు. అందరాని పదమును (= మోక్ష స్థానమును) అందుకో!' అని ప్రత్యక్షంగా చెప్పాడు. దీనినే పల్లవిలోనే చెప్పవచ్చు కదా! అంటే చెప్పదలుచుకొన్న విషయంలో బలం తగ్గిపోతుంది.

పరచిత్తానుసారంగా కొలుచుటను సేవ అంటారు. సేవకే ఇంకొక పేరు శ్వవృత్తి. అంటే కుక్కలాగా ఒకడిముందు ప్రవర్తించటం. యజమాని చేతిలో మాంసం ముక్కను చూపిస్తుంటే, –ఆ మాంసం ముక్క కోసం – కుక్క తోక ఊపుకొంటూ, వాడిముందు చొంగలు కారుస్తుంటుంది. ఇటువంటి మనుజసేవను కవి నిరసించాడు.

దీనులకు, కష్టాలలో ఉన్న వాళ్లకి సేవ చేయటంలో తప్పులేదు. ఇది నిస్వార్థ సేవ. మన పొట్టనింపుకోవటంకోసం, అవసరాలు తీరటంకోసం చేసేది స్వార్థ సేవ.

దొంగ గొడ్డు పరుగెత్తుకొని పోకుండా, దాని మోకాళ్లకు తగిలి కొట్టుకొనేటట్లు దాని మెడలో రెండు కొయ్యలు వేలాడగడతారు. దీనినే లంపటం అంటారు. గొడ్డుకు మెడలో రెండు కొయ్యలే. సేవక వృత్తి చేసే మనిషికి రకరకాల లంపటాలు. వీటివల్ల సంసారంలో, చిక్కుల్లో తగుల్కొంటాడు. వీటన్నింటిని వదిలి స్వామి దగ్గరికి వెళదామని అనిపించినా లంపటాలు అడ్డుపడతాయి.

లంపటాలకి మూలకారణం ఒకటే ఆకలి. దీని బాధ తీరటం కోసం సేవ (కొలువు) మొదలు పెడతాడు. కడుపులో ఆకలిగోలని తీర్చిన తర్వాత శరీరం ఇంకొకరకమైన ఆకలి తీర్చమని ఒత్తిడి తెస్తుంది. ఈ కామమనే రెండవ ఆకలి తీర్చటం కోసం మనిషి జన్మ స్థానం కోసం పెరపెరలాడు తున్నాడని (పుట్టిన చోటికై పొరలి మనసు పెట్టి ) – ఈ గీతంలో అన్నమయ్య నిరసించాడు. జీవుడు – సహజంగానే – పిరికి తనమనే దోషానికి లోనైన స్వభావం కలిగినవాడు. (గీత 02–07) 'నేను ఏమవుతానో! ఈ ఉద్యోగం చేయక పోతే – నా బతుకేమవుతుందో! ఎటువంటి పరిస్థితులలోను ఈ కొలువు వదులుకోకూడదు' అనుకొంటూ – పిరికి తనాన్ని – ధైర్యంగా మార్చుకొనే ప్రయత్నంలో, ఫలాసక్తితో కర్మలను ఆచరిస్తూ (గీత 02–49) తోటి మనిషి అడుగులకు మడుగులొత్తుతుంటాడు. ఉత్తమోత్తమమైన మానవజన్మ ఎత్తి భగవంతుని తత్వాన్ని తెలుసుకోవటానికి స్వామివారి సేవలో తరించవలసిన జీవుడు – ఇలా – తన స్వార్థం కోసం – తోటి మనిషి సేవలో జీవితాన్ని వ్యర్థం చేసుకొంటున్నాడని అన్నమయ్య బాధతో – 'మనుజుడై పుట్టి' –అంటూ మానవుని కర్తవ్యాన్ని నిర్దేశించాడు.

ఆధునిక కాలంలో ఈ అన్నమయ్య గీతం అన్వయిస్తుందా? అందరం ఉద్యోగ సేవలు మానేసి – నిరంతరం భగవంతుని సేవ చేస్తూ ఉంటే – సంసారాలు నడుస్తాయా? – కుటుంబాలకి కుటుంబాలు ఆకలితో మలమలమాడి చావవా? ఈ సమస్యలన్నింటికి అన్నమయ్య శరణమనే ఉ పాయాన్ని అనేక కీర్తనలలో ఉపదేశించాడు. భౌతికంగా కర్మలు చేస్తూనే – ఫలితాలన్నింటిని స్వామివారికి అర్పిస్తూ – జీవితంలో ప్రవర్తించాలి. శరణాగతుడైన భక్తుడిని తన సేవకు ఎలా రప్పించుకోవాలో స్వామికి బాగా తెలుసు. అప్పటిదాక శరణాగత బుద్ధి, మనుజసేవ – వదలకూడదు.

## 20. మరి యెందూ గతిలేదు

మరి యెందూ గతి లేదు మనుప నీవే దిక్కు
జరసి లక్ష్మీశ నీ శరణమే దిక్కు

1. భవ సాగరంబులో బడి మునిగిన నాకు
తివిరి నీ నామమను తేపయే దిక్కు
చివికి కర్మంబనెడి చిచ్చు చొచ్చిన నాకు
జవళి నాచార్య కృపా జలధియే దిక్కు

2. ఘన మోహ పాశముల గాలి బొయ్యేడినాకు
కొనల నీపాద చింత కొమ్మయే దిక్కు
కనలి మనసనెడి ఆకసముననున్న నాకు
కనుగొనగ నీ దాస్య గరుడడే దిక్కు

3. మరిగి సంసారమనెడి మంటి కిందటి నాకు
ధర భక్తియను బిల ద్వారమే దిక్కు
యిరవైన శ్రీవేంకటేశ యిన్నిటానాకు
నరుదైన నీవంతరాత్మవే దిక్కు

(తా.ప.సా.02-146)

**భగవద్గీతా శ్లోకం**

గతిర్భర్తా ప్రభుః సాక్షీ
నివాసః శరణం సుహృత్
ప్ర భవః ప్రలయః
స్థానం నిధానం బీజమవ్యయమ్
(గీ. 9-18)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

పొందదగినవాడా నేనే. సర్వమున్నూ భరించేటివాడా నేనే. అన్నిటికిన్నీ సాక్షిన్నీ నేనే. వునికి పట్టున్నూ నేనే. రక్షకుడా నేనే. అందరికీన్నీ పుట్టుగులకున్నూ కారణమున్నూ నేనే. నిధానమున్నూ నేనే. చెడని కారణమున్నూ నేనే.

(పుట-163)

***భావ విశేషాలు :***

ఓ లక్ష్మీ నరసింహా! శ్రీవేంకటేశా! నిశ్చయంగా (=మరి) నాకు ఇంకో గతి లేదు. నన్ను రక్షించటానికి (=మనుప) నువ్వే దిక్కు. నీ పాదాల దగ్గరికి చేరి (=జరసి) నువ్వే నాకు శరణమని పలుకుతాను. అదే నాకు మార్గం. (=దిక్కు)

1. సంసారమనే సముద్రంలో (=భవసాగరం) పడిపోయి, మునిగిపోయిన నాకు, వేగంగా (=తివిరి) పైకి రావటానికి నీపేరు అనే తెప్ప (=తేప) దిక్కు. బాధ పడి (=చివికి) కర్మ అనే అగ్నిలో ప్రవేశించిన నాకు, దయా సముద్రమైన నా గురువు అనే కొత్త వస్త్ర మే ( =జవళి) దిక్కు. (మంటలలో చిక్కుకొన్న వాడి ఒంటికి బట్ట చుట్టి కాపాడినట్లుగా స్వామి ప్రేరణతో గురువు కాపాడతాడని భావం)

2. గొప్పవైన మోహమనే తాళ్లతో కట్టి వేయబడి గాలిలో కొట్టుకుపోతున్న నాకు, తుట్టతుదకు నీ పాదమనెడి చింతకొమ్మ దిక్కు. అనుకొన్న ఆశలు నెరవేరక కోపంతో, (=కనలి) బాధతో రగిలిపోయే మనస్సనే ఆకాశంలో ఉన్న నాకు, నీ దాస్యమనే గరుత్మంతుడే దిక్కు.

3. కోరిక నా స్వస్వరూపాన్ని అడుగుకి తోసి మట్టికుప్పలా నన్ను ఆక్రమించుకొంది. వాంఛలను అణగ దొక్కాల్సిన నేను వాటిని మరిగి సంసారమనే మట్టికుప్ప కింద కూరుకు పోయాను. నీ భక్తి - ఒక బిలమై (=రంధ్రమై) ఆ వాంఛల మట్టికుప్ప అడుగున ఉన్న నా స్వస్వరూపాన్ని పైకి తీసుకురావటానికి కారణమవుతుంది. కనుక ఓ స్వామీ! ఈ సంసార వాంఛలనుండి బయటపడటానికి నీ భక్తి అను ఆ బిల ద్వారమే నాకు దిక్కు. ఓ వేంకటేశా! అద్భుతమైన నువ్వు నాలో అంతరాత్మగా ఉన్నావు. లోపల, బయటా వ్యాపించిన నువ్వే నాకు దిక్కు.

శ్రీశంకరభగవత్పాదులవారి లక్ష్మీ నృసింహ కరావలంబ స్తోత్ర ప్రభావం ఈ గీతంలో ఆద్యంతం కనిపిస్తుంది.

'లక్ష్మీశ నీ శరణమే దిక్కు' అను సంబోధన 'లక్ష్మీ నరసింహ మమ దేహి కరావలంబం' అను పాదాన్ని జ్ఞాపకం చేస్తుంది. 'భవాబ్ధి పోత' అని కరావలంబ స్తోత్రంలో ఉంటే 'సంసారమనే సముద్రంలో పడిపోయి మునిగిపోయిన నాకు, వేగంగా పైకి రావటానికి నీపేరు అనే తెప్ప దిక్కు' అని అన్నమయ్య వివరించాడు. 'సంసార దావ దహనాతుర...' అనే పదాలకి కర్మమనే చిచ్చు చొచ్చిన' అని అన్నమయ్య సమీపానువాదం. మోహాంధ కూప కుహరంలో పడ్డానని శంకరులు రాస్తే మోహపాశాలతో గాలికి కొట్టుకు పోతున్నానన్నాడు అన్నమయ్య.

సంస్కృతంలో లక్ష్మీ నృసింహ కరావలంబ స్తోత్రం చదివితే సంకటాలు నశిస్తాయని భక్తులు ప్రగాఢంగా నమ్ముతారు. తెలుగులో - ఆ కరావలంబ స్తోత్రానికి దీటుగా రాసిన ఈఅన్నమయ్య గీతంకూడ భక్తితో చదివినవారికి తప్పక సంకట నాశనం జరిగితీరుతుంది.

'నీ పాదచింత కొమ్మ' అను సమాసాన్ని శ్రీగౌరిపెద్ది రామసుబ్బశర్మగారు '*చింత కొమ్మ అనుటే బాగున్నట్లు తోచెడిని. చింత కొమ్మ చాలా గట్టిది. మోక్షమునకు హరి పాదములంత గట్టి*' వని వివరించారు. (తా.ప.సా.02వ సం. -98పే.)

ఈ గీతంలోని 'దిక్కు' అంటే శరణమని, మార్గమని అర్థాలు. 'త్వాం ప్రపన్నమ్' నీ శరణాగతుడను (02-07) అను భగవద్గీతలోని జీవుని ఆవేదన ఈ గీతంలో ప్రతి పదంలో ప్రతి పాదంలో ప్రతిధ్వనించింది. బుద్ధౌ శరణమన్విచ్ఛ.. సమత్వబుద్ధితో తనను శరణవేడుమని స్వామి వాక్యం. (02-49) అంటే జీవితంలోని ప్రతి స్థితిలోను, నిరంతరం స్వామిని శరణు వేడుమని దీని వివరణ. అందుకే అన్నమయ్య కూడ జీవితంలోని వివిధ స్థితులను ఈ గీతంలో ఉటంకించి శరణుకోరాడు.

'పరమాత్మ తత్వాన్ని తెలుసుకొన్న జ్ఞానులు తత్త్వ జ్ఞానాన్ని నీకు బోధిస్తారు. వారికి భక్తి శ్రద్ధలతో దండ ప్రణామాలు, సేవలు చేయటం ద్వారా, వినయంతో ప్రశ్నించి తత్త్వ జ్ఞానాన్ని తెలుసుకో.' (04-34) అని గురువు ఆవశ్యకతను జగద్గురువు భగవద్గీతలో అర్జునుని ముఖతః మనందరికి చెప్పారు. దీనిని మనందరికి మరోమారు గుర్తు చేయటానికి అన్నమయ్య ఈగీతంలో గురువును శరణు వేడాడు. (జవళి నాచార్యు కృపా జలధియే దిక్కు) నిప్పులలో కాలుతున్న ఒంటికి చుట్టిన బలమైన బట్ట నిప్పు యొక్క ప్రభావాన్ని తగ్గించి శరీరానికి స్వస్థత నిస్తుంది. ఆలాగే కర్మ అనే అగ్నిలో ప్రవేశించిన నాకు, నా గురువు అనే వస్త్రమే దిక్కని అన్నమయ్య హితబోధ.

దాస్యం చేయటంలో గరుత్మంతునిది ఒక విశిష్టమయిన పద్ధతి. తల్లి దాస్య విముక్తి కోసం - ఇంద్రునినుంచి అమృతాన్ని తెచ్చేటప్పుడు, ఒక చుక్క నోట్లో వేసుకొందామని ఆ మహానుభావునికి అనిపించలేదు. ఈ నిజాయితీ గుణం నచ్చిన శ్రీమహా విష్ణువు గరుత్మంతుని తన వాహనంగా చేసుకొన్నాడు. సమస్యలని దూది పింజల్లా ఎగురగొట్టే - నిజాయితీ పరుడైన - సమర్థుడైన - గరుత్మంతుడు - తన మనస్సనే ఆకాశంలో కమ్ముకొన్న కోపాగ్ని రాశులను చల్లార్చాలని, ఆయనే దిక్కని అన్నమయ్య ఈ గీతంలో శరణు వేడాడు. మనమూ అలాగే ప్రార్థించి ధన్యులమవుదాం.

## 21. మూడే మాటలు

మూడే మాటలు మూడు మూండ్లు తొమ్మిది
వేడుకొని చదువరో వేదాంత రహస్యము

1. జీవ స్వరూపము చింతించి యంతటాను
దేవుని వైభవము తెలిసి
భావించి ప్రకృతి సంపద యిది యెరుగుటే
వేవేలు విధముల వేదాంత రహస్యము

2. తనలోని జ్ఞానము తప్పకుండా దలపోసి
పనితోడనందువల్ల భక్తి నిలిపి
మనికిగా వైరాగ్యము మరవకుండుటే
వినవలసినయట్టి వేదాంత రహస్యము

3. వేడుకతో నాచార్య విశ్వాసముగలిగి
జాడల శరణాగతి సాధనముతో
కూడి శ్రీవేంకటేశ్వరు గొలిచి దాసుడౌటే
వీడని బ్రహ్మానంద వేదాంత రహస్యము

(తా.ప.సా.02-233)

**భగవద్గీతా శ్లోకం**

(అన్నమయ్య ఈ గీతంలో చెప్పిన తొమ్మిది మాటలకు సంబంధించిన తొమ్మిది భగవద్గీతా శ్లోకములు విస్తరణ భీతిచే అధ్యాయము - శ్లోక సంఖ్యలు వరకు మాత్రమే చూపబడుచున్నవి. జిజ్ఞాసువులు గీతలో వాటిని విపులముగా చదివి ఆనందించవలసినదిగా మనవి.)

1. జీవుని స్వరూపం -13-21, 2. దేవుని వైభవం -16-1,2,3 3. ప్రకృతి -03-27, 4. జ్ఞానం -13-11, 5. భక్తి -12-02, 6. వైరాగ్యం -13-08, 7. ఆచార్య విశ్వాసం -04-34, 8. శరణాగతి -03-30,08-07,18-57,18-66, 9. దాస్యం -18-73

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

..... జీవుడు ప్రకృతిలోనుండి ఆత్మానుభవం విడిచి, ప్రకృతి గుణాల పుట్టిన సుఖ దుఃఖాలు అనుభవిస్తున్నందును. అటుగనుక, జీవునికి మంచి జన్మాలందున్నూ, చెడ్డ జన్మాలందున్ను పుట్టేటందుకు కారణము గుణసంగము.

(పుట-163)

***భావ విశేషాలు :***

విశిష్టాద్వైత వేదాంత రహస్యాన్ని తెలియటానికి మూడు మూళ్లు తొమ్మిది మాటలు ఉన్నాయి. ఈ తొమ్మిది మాటలు, వాటి పరమార్థాలు గురువును వేడుకొని చదువుకోండి.

1. ఆ *జీవుని* స్వరూపమేమిటో అంతటా ఆలోచించండి. ఈ *దేవుని* వైభవం తెలుసుకోండి. *ప్రకృతి* సంపదను చక్కగా భావన చేసి తెలుసుకోండి. ఈ మొదటి మూడు మాటలు తెలుసుకోవటంలో అనేకములైన(=వేవేలు విధాల) వేదాంత రహస్యాలు దాగి ఉన్నాయి.

2. తనలో ఉన్న *జ్ఞానాన్ని* తప్పకుండా భావించాలి. ప్రయత్నంతో (=పనితోడ) *భక్తిని* నిలుపుకోవాలి. బతుకుగా (=మనికిగా) *వైరాగ్యాన్ని* మలుచుకొని ఎప్పుడూ మరిచిపోకూడదు. ఈ వేదాంత రహస్యము విని తీరవలసినది.

3. కుతూహలంతో (=వేడుక) *గురువుమీద విశ్వాసం* కలిగి ఉండాలి. గురువుగారి అడుగు జాడలలో *శరణాగతిని* సాధనంగా స్వీకరించాలి. హృదయంలో కలిసిన (=కూడి) శ్రీవేంకటేశ్వరుని కొలిచి ఆ దేవునికి *దాస్యం* చేయాలి. ఇది శాశ్వతంగా ఏనాడు వీడని బ్రహ్మానంద వేదాంత రహస్యం.

'ఇదుగో! రెండు మాటలు చెబుతాను... వింటావా!' తెలుగు మాట్లాడుకొనే, తెలుగువారి లోగిళ్లలో అప్పు డప్పుడు వినిపించే వాక్యమిది. ఇది తెలుగువారి పలుకుబడి. ఈ పలుకుబడితో అన్నమయ్య ఈ కీర్తన ప్రారంభించాడు. కాక పోతే రెండును – మూడు – చేసాడు.

ఆత్మీయమైన (=ఆత్మకు సంబంధించిన) బరువైన విషయమైనప్పటికీ – ఆత్మీయంగా (=అప్యాయతగా) దానిని సామాన్యునికి అందించాలని కవి 'మూడే మాటలు' అని మొదలు పెట్టాడు. పాఠకుడు తన మనస్సును – కవికి అప్పగించిన తరుణంలోనే మూడు మూళ్లు తొమ్మిది– అన్నాడు. మూడే అనుకొంటే – ఇంకా మూడు మూళ్లు తొమ్మిది – అంటున్నాడని అది తెలుసుకోవాలని పాఠకునికి ఇంకా ఆసక్తి ఏర్పడుతుంది. ఆ – తొమ్మిది ఏమిటో నీకు చరణాలలో చెబుతాను కాని – ఇది చాలా రహస్యం – అన్నాడు కవి వెంటనే. పాఠకుడిలో కుతూహలం మరింతగా పెంచే ఈ రచనా విధానం అద్భుతం.

కవి : 'రహః అంటే ఏకాంత స్థలం. దానిలోనుంచి పుట్టింది రహస్యం. దేవుడిలో జీవుడు ఐక్యమయ్యే ప్రక్రియ కూడా ఎవరికి వారికి మాత్రమే పరిమితమైన రహస్య ప్రక్రియ. అందుకే దానిని వేదాంత రహస్యం అంటారు. తొమ్మిది మాటల వేదాంత రహస్యాన్ని గురువులను వేడుకొని తెలుసుకో!'

పాఠకుడు : 'మరి మీరు చెప్పరా!"

కవి : 'చెబుతా! తొమ్మిది మాటలను స్థూలంగా నీకు మూడు చరణాలలో పరిచయం చేసాను. సూక్ష్మంగా వాటి వివరణని గురువుల దగ్గర ప్రాధేయపడి తెలుసుకో!'

పాఠకుడు : 'ప్రాధేయపడటం ఎందుకు?'

కవి : 'దేవుడిని చూపించేవాడే గురువు. గురువు మీద భక్తి ఉన్నవాడే పరబ్రహ్మను చూడగలుగుతాడు. విద్యను అర్థించేవాడు విద్యార్థి. అర్థించినప్పుడే ఏ విద్య అయినా వస్తుంది. బలవంతంచేసి గురువుదగ్గర విద్య నేర్చుకోకూడదు.'

పాఠకుడు : 'మీరు గురువులమీద చేసిన ఈ వ్యాఖ్యానం సర్వకాలాల్లోను తిరుగులేని సత్యం.'

కవి : సంతోషం.. ఒక మాట.. శరీరంలో జీవుడున్నాడు. జీవుడిలో అంతర్యామిగా విష్ణువున్నాడు. అజ్ఞానంతో సంసార బంధంలో చిక్కుకొన్న జీవులు దేవుని దయతో, గురుకటాక్షంతో, జ్ఞానులై, శరణాగతులై మరణం తరువాత మోక్షాన్ని పొందుతారు. ఇదే భగవద్గీతలోను, నా గీతంలోను చెప్పిన తొమ్మిదిమాటల విశిష్టాద్వైతం. తెలుసుకొని తరించు.'

పాఠకుడు : 'అన్నమాచార్యా! మీరే మాగురువులు. మీ ద్వారా, మీ గీతాల ద్వారా మాకు బ్రహ్మ సాక్షాత్కారం తథ్యం. మీరే మాలో ప్రతి ఒక్కరికి తొమ్మిది మాటల సూక్ష్మజ్ఞాన అనుభూతి కూడా ప్రసాదించండి'.

## 22. వట్టి లంపటాల

వట్టి లంపటాల బడి వడ బొరలుటకంటె
వొట్టిన విరతి నూరకుండుటే సుఖము

1. పాపము మానినయట్టి బదుకొక్కటె సుఖము
కోపము విడిచినట్టి గుణమొక్కటి సుఖము
చేపట్టి గురుబుద్ధి సేసేటిదే సుఖము తీ-
దీపుల బడనియట్టి దినమే సుఖము

2. మహి జంచలము లేని మనసొక్కటి సుఖము
సహజాచారముతోడిజన్మమొక్కటి సుఖము
యిహపరసాధనపు యెన్నికొక్కటి సుఖము
బహుళపుటాసకంటె పరిపాటి సుఖము

3. పరుల పీడించి తేని పసిడొక్కటి సుఖము
గరిమ నిజముతోడగల మాటలే సుఖము
ధర శ్రీవేంకటేశు దాసానుదాసుడయి
సరవితో నడచేటి శాంతమే సుఖము

(తా.ప.సా.02-159)

**భగవద్గీతా శ్లోకం**

యత్తదగ్రే విషమివ
పరిణామేఽమృతోపమమ్
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమ్,
ఆత్మ బుద్ధి ప్రసాదజమ్

(గీ. 18-37)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

యే సుఖమైనాను యోగం దొరకొన్నప్పుడు, అనేక ప్రయాసాలతో గూడి విషంవలె దుఃఖమయి తోచీన్నీ. యోగాభ్యాసం అలవడితేను ఆత్మ స్వరూపము గానవచ్చి, అమృతముతో సరి అయినదై, ఆత్మ స్వరూప జ్ఞానము ప్రకాశించెడిదై వుండును. అది సాత్విక సుఖము.

(పుట-319,320)

***భావ విశేషాలు :***

సుఖమంటే ఏమిటో అన్నమయ్య ఈ గీతంలో వివరిస్తున్నాడు.

వ్యర్థమయిన శ్రమలు (=లంపటాలు) చేసి, తీరని తాపంతో (=వడ), అటు ఇటు దొర్లుటకంటె (=పొరలుట) ఏమి చేయకుండా, విషయ సుఖాలలో ఆపేక్ష లేకుండా ఉండటం (=విరతి) సుఖాన్ని కలిగిస్తుంది.

1. పాపాలు చేయకుండా ఉన్న బతుకొక్కటే సుఖం. కోపం విడచిన స్వభావమొక్కటే (=గుణం) సుఖం. గురువు చెప్పిన పని వెంటనే ప్రారంభించి (=చేపట్టి) చేయటమే సుఖం. ఎక్కువ తీయదనాలు (= తీదీపులు) పొందని దినమే సుఖం కలిగిస్తుంది.

2. ఈ భూమిలో చలించని మనస్సొక్కటే సుఖం. జన్మసిద్ధమైన, స్వాభావికమైన ఆచారము (=సహజాచారము)తో ఉన్న జన్మ ఒక్కటే సుఖాన్ని కలిగిస్తుంది. ఈ లోకానికి, పరలోకానికి పనికివచ్చే ఒక మంచి సాధనాన్ని ఎన్నుకొనటమే సుఖం. అత్యాశ (=బహుళపుటాశ) కంటె, సాధారణమైన (=పరిపాటి) ఆశ సుఖం.

3. ఇతరులను పీడించి తీసుకురాని ధనం (= పసిడి) సుఖం. గొప్ప (=గరిమ) నిజాలతో ఉన్నమాటలే సుఖం. ఈ భూమిలో (=ధర) శ్రీవేంకటేశ్వరుని సేవకులకు సేవకునిగా ఉండి, చక్కటి ప్రవర్తనతో (=సరవి) శాంతంగా నడుపుకొనే జీవితమే సుఖాన్ని కలిగిస్తుంది.

భగవద్గీతలో సాత్వికం, రాజసం, తామసం - అని సుఖాన్ని మూడు రకాలుగా విభజించి కృష్ణ స్వామి వాటిని వివరించాడు. (18-36,37,38,39) ప్రారంభంలో దుఃఖంగా ఉన్నప్పటికీ, రాను రాను ఏది అమృతంగా మారుతుందో. దుఃఖాలను అతిక్రమిస్తుందో ఆ సుఖాన్ని సాత్విక సుఖం అంటారు. దేవునికంటె వేరుగా దేనిని చూడకుండా, వినకుండా, తెలిసికొనకుండా ఉండే స్థితిలో లభించే పరమానంద సుఖాన్ని 'భూమా సుఖమ'ంటారని ఛాందోగ్యోపనిషత్తు చెబుతోంది.దీనినే అవధిలేని సుఖంగా (06-21), అక్షయ సుఖంగా (05-21) గీత పేర్కొంది. ఈ గీతా భావాలన్నింటిని కలిపి 'సరవితో నడచేటి శాంతమే సుఖము' అని అన్నమయ్య ఈ గీతంలో ముక్తాయింపు ఇచ్చాడు. అన్నమయ్య చెప్పిన శాంత స్థితి ఈ అవధిలేని సుఖమే. ఇదే గొప్ప సుఖం. దీనిని మించిందిలేదు. అందుకే అన్నమయ్య కూడ దీనిని గీతంలో చిట్టచివరగా పేర్కొన్నాడు.

ఇంద్రియాలు పొందే సుఖభోగాలన్నీ దుఃఖానికి కారణాలు. అవి ఆది అంతం లేనివి. వివేకి వాటియందు ఉదాసీనంగా ఉంటాడని గీతలో చెప్పిన భావాన్ని (05-22) ఈ గీతంలో పల్లవిగా అన్నమయ్య మార్చాడు. సుఖాలకోసం లంపటాలలో పడి, బయటికి రాలేక, తీరని తాపంతో, బాధ పడటం కంటే ఏమి చేయకుండా, విషయ సుఖాలలో ఆపేక్ష లేకుండా ఉండటం సుఖాన్ని కలిగిస్తుందని మనస్సుకు హత్తుకొనేటట్లు చెప్పాడు. ఈగీతంలో అన్నమయ్య సుఖ నిర్వచనాన్ని ప్రతి పాదంలో చేస్తూనే - తన గీతం - ఇహ పరసాధనమని-తను చెప్పినట్లు వ్యక్తిత్వాలను మలుచుకొంటే - ఈ లోకంలోను, పైలోకంలోను సుఖంగా ఉంటారని చెప్పకుండా చెప్పాడు.

'పాపం చేయకు, కోపాన్ని విడచిపెట్టు, పెద్దలు చెప్పినట్టు నడుచుకో, కొత్త కొత్త తీయదనాలు ప్రతిరోజు కావాలని కోరుకోకు, మనస్సును స్థిరంగా ఉంచుకో, నీ జన్మతః నువ్వు చేయవలసిన ధర్మమేముందో అది పాటించు, అత్యాశలకు పోకు, ఇతరులను పీడించకుండా ధనాన్ని సంపాదించు, నిజమే మాట్లాడు, దైవాన్ని నమ్ముకొని, దైవ భక్తులకు - అంటే - మంచివారికి సేవలు చేస్తూ ప్రశాంతంగా జీవితాన్ని గడుపుకో!' - మూడు చరణాల్లోను అన్నమయ్య చెప్పిన ఉత్తమ వ్యక్తిత్వ సూత్రాలివి. ఈ వ్యక్తిత్వ సూత్రాలలో చాలా వాటికి ఆధునిక కాలంలో ప్రసిద్ధి చెందిన వ్యక్తిత్వ వికాస పుస్తకాలలో సంగతత్వం (relevance) కనబడటం గమనార్హం.

ఉదాహరణకి దాదాపు 300 పుస్తకాలని అధ్యయనం చేసి రాసిన, ప్రసిద్ధమైన సి. నరసింహారావుగారి వ్యక్తిత్వ వికాసం పుస్తకంలో 'ఏ సమస్యనైనా పరిష్కరించలేక, దానితో సర్దుకోలేక మాత్రమే ఎవరైనా ఆగ్రహానికి గురవుతారు' అని ఒక వాక్యం ఉంది. (22పే. 21వ ముద్రణ) కోపము విడిచినట్టి గుణము సుఖమన్నాడు అన్నమయ్య. అభ్యసింపబడేదాన్ని గుణమంటారు. నీ వ్యక్తిత్వంలో కోపాన్ని విడిచి పెట్టడానికి చేసిన అభ్యాసం సుఖం. అంటే అలా కోపాన్ని విడచిపెట్టడం అభ్యసింపమని - సర్దుకుపొమ్మనేకదా - మహాకవి ప్రబోధం.

ఇలా అధునిక పుస్తకాలన్నింటిలోను, ప్రతి అంశంలోను - అన్నమయ్యకు, గీతకు సంబంధముందని కాదు - నేను చెప్పదలుచుకొన్నది. ఆ తరాన్ని దాటిన - ఈ అధునిక తరం - వ్యక్తిత్వ పరంగా, విషయపరంగా - కొన్ని అదనపురత్నాలను పుస్తకాలలో చేర్చింది. అందులో అనుమానమే లేదు. కాని మొదటగా అధ్యాత్మికతతో పాటు - వ్యక్తిత్వ జీవనశైలిని మలిచిన - అన్నమయ్య లాంటి జాతిరత్నాలను - ఈ జాతి నెత్తిన పెట్టుకోవాలిసినంతగా పెట్టుకొని, అధ్యయనం చేయటం లేదనేదే- విషాదమయిన వాస్తవం.

## 23. విజాతులన్నియు వృథా

విజాతులన్నియు వృథా వృథా
అజామిళాదులకది యే జాతి

1. జాతి భేదములు-శరీర గుణములు
జాతి శరీరము-సరి దోడనె చెడు,
ఆతుమ పరిశుద్ధంబెప్పుడును అదినిర్దోషంబనాది
యీతల హరి విజ్ఞానపు దాస్యంబిది యొక్కటె పో సుజాతి

2. హరియిందరిలోనంతరాత్ముడిదె
ధరణి జాతిభేదములెంచిన
పరమయోగులీభావమష్టమదము-భవవికారమని మానిరి
ధరణిలోన బరతత్త్వజ్ఞానము ధర్మ మూలమే సుజాతి

3. లౌకిక వైదిక లంపటులకునివి
కైకొనునవశ్య కర్తవ్యంబులు
శ్రీకాంతుడు శ్రీవేంకటపతి సేసిన సంపాదమిందరికి
మేకొని యిన్నియు మీరినవారికి మీనామమే సుజాతి

(తా.ప.సా.02-383)

**భగవద్గీతా శ్లోకం**

.........నాయం భూత్వా
భవితా వా నభూయః
అజో నిత్యశ్శాశ్వతోయం
పురాణో న హన్యతే హన్యమానే శరీరే
(గీ. 02-20)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

........యీ యాత్మ వెనకకి అయ్ని వాడున్నూ కాడు., ముందరికీన్నీ అయ్యేవాడు గాడు, వెనకకు పుట్టిన వాడున్నూ కాడు, చచ్చిన వాడున్ను కాడు, ముందర పుట్టెడి వాడున్ను కాడు, అజుడై, నిత్యుడై, శాశ్వతుడై, పురాణుడైన యీ ఆత్మ శరీరం చంపబడుచుండగానున్ను, తాను చచ్చెడివాడున్ను కాడు.
(పుట-319,320)

***భావ విశేషాలు :***

కులాలను, మతాలను అన్నమయ్య జాతుల పేరుతో ఈ గీతంలో నిరసిస్తున్నాడు. రకరకాలైన ఈ జాతులన్నీ ఉపయోగం లేనివి. అజామిళుడు మొదలైన వారిది ఏ జాతి? (గొప్ప జాతిలో జన్మించటం వల్ల అజామిళునికి మోక్షం రాలేదు. కేవలం తన మరణ దశలో స్వామి నామాన్ని ఉచ్చరించాడు కనుక మోక్షం పొందాడు. కనుక జాతులవల్ల ప్రయోజనం లేదు. దేవుని నామం జపించటం వల్లనే ప్రయోజనమని భావం)

1. జాతి భేదాలన్నీ శరీరానికి సంబంధించిన స్వభావాలు. శరీరాలు చెడిపోయిన వెంటనే వాటి స్వభావాలయిన జాతులు చెడిపోతాయి. కనుక అశాశ్వతములయిన జాతులు, కులాలు కోసం కొట్టుకోకూడదు. ఆత్మ ఎప్పుడూ పరిశుద్ధమైనది. అది దోషాలు లేనిది. మరియూ మొదలు లేనిది. ఆత్మలో ఉన్న హరిని తెలుసుకోవటానికి దాస్యం చేయాలి. ఇది ఒక్కటే నిజమైన జాతి లక్షణం.

2. శ్రీహరి మన అందరిలోను అంతరాత్మునిగా ఉన్నాడు. ఈ జాతి భేద భావాలలో అన్న, అర్థ, స్త్రీ, విద్య, కుల, రూప, ఉద్యోగ, యౌవనమదాలనే ఎనిమిది మదాలున్నాయని, జాతి భేదం పాటించడం సంసార వికారమని గొప్ప యోగులు గుర్తించారు. అందుకే వాళ్లందరూ ఈ జాతి భేదాలు పాటించలేదు. మంచి జాతికి ధర్మం, పరతత్త్వాన్ని తెలుసుకోవటం మూల లక్షణాలు.

3. లౌకిక, వైదిక ఆచారాలు పాటించటంలో ఆసక్తి ఉన్నవారికి మాత్రమే - ఈ జాతి భేదాలు- తప్పక పాటించవలసిన కర్తవ్యాలు. (మిగతావారికి కాదని భావం) జాతి భేదాలు లక్ష్మికి భర్త శ్రీవేంకటేశ్వరుడు తన మాయా ప్రభావంతో చేసినవి. పూని (=మేకొని) మాయను దాటిన వారికి - స్వామివారి నామస్మరణమే ఉత్తమ జాతి లక్షణం.

కుల మత రహిత సామాజిక వ్యవస్థకు అన్నమయ్య పూరించిన ఆధ్యాత్మిక శంఖారావం ఈ గీతం. స్వామి నామ జపం చేయటం, దాస్యం చేయటం, ఆ పరమ తత్త్వాన్ని తెలుసుకోవటానికి ప్రయత్నించటం - ఇవి మంచి జాతి లక్ష ణాలు. ఇంతకు తప్పించి ఆచారాలు, కట్టుబాట్లు - ఇలాంటివి ఆచరించమని చెప్పే జాతులు, కులాలు వృథా అని పదకవితా పితామహుడు ఈ గీతంలో తీర్మానించాడు. లౌకికంగా సమాజంలో ఏవో కొన్ని లాభాలు కావాలని భావించే వారు మాత్రమే, ఈ లోకంలో జాతి భేదాలు పాటిస్తారని కవిగారు ఆత్మ సాక్షిగా 'అక్షింతలు' కూడా వేసారు.

భగవద్గీతలో కులాలు, జాతుల ప్రస్తావన రెండవ అధ్యాయంలో (38,39,40,41,42,43) ఉంది. యుద్ధం చేయటం వల్ల కులాలు సంకరమవుతాయని, జాతి ధర్మాలు పోతాయని అర్జునుడనే జీవుడు స్వామివారికి ఈ రెండవ అధ్యాయంలో విన్నవించుకొన్నాడు. ఈ కులాలమీద, వర్ణాల మీద స్వామి వారి వివరణ నాలుగవ అధ్యాయంలో ప్రసిద్ధమైన చాతుర్వర్ణ్యం ....శ్లోకంలో (04-13) ఉంది. గుణ కర్మలను బట్టి నాలుగు వర్ణాలున్నాయని స్వామి వివరణ. పుట్టుకతోనే - వర్ణంలో పుట్టినంత మాత్రాన అతడు బ్రాహ్మణుడు కాడు. బ్రాహ్మణ గుణాలు అలవరుచుకొంటేనే, వాటిని ఆచరిస్తేనే అతను బ్రాహ్మణుడు. ఇట్లాగే మిగతా వర్ణాలు. వైద్యుడి కొడుకు అయినంత మాత్రాన అతను వైద్యుడు కాడు. విద్యను నేర్చుకొని, వృత్తిగా అభ్యాసంలో దానిని ఆచరిస్తేనే వైద్యుడు. శ్రీమద్భాగవతంలో నారదుడు కూడ ఇదే విషయాన్ని ధ్రువపరిచాడు. (07-11-35)

అన్నమయ్య - భగవద్గీతలో స్వామి పేర్కొన్న గుణ శబ్దాన్ని అదే ధోరణిలో - కవితాత్మకంగా వ్యాఖ్యానించాడు. 'శరీర ధారులు చేసే వృత్తులనుబట్టి వాళ్లకు స్వభావాలు ఏర్పడతాయి. ఆ కులాల పేరుతో పిలుచుకొనే స్వభావాలు - కట్టెల మీదకి శరీరాలని చేర్చటంతోనే పోతాయి. 'శాశ్వతుడైన పరమాత్మకి దాస్యం చెయ్యరా! - కుల మతాల కట్టుబాట్లకి కాదు.' అని కవి మందలింపు.

అందరిలో - శ్రీహరి ఉన్నాడని నమ్మి - ఆ - ఆత్మ జ్ఞానం కోసం ప్రయత్నించాలిగాని, కులాల లెక్కతో, మతాల లెక్కతో మనుష్యులను, మనస్సులను విడగొట్టుకోకండని - మదాలు, వికారాలు పెంచే కుల మతాల అజ్ఞాన ప్రవాహంలో కొట్టుకుపోకండని - అన్నమయ్య చేసిన బోధ - ఈ ఆధునిక కులమతాల రాజకీయ వాతావరణంలో ప్రతిగుండెలో ప్రతిధ్వనించాలి. అన్నమయ్య గీతం సార్వకాలికమైనది.

అజామిళుడు మహా పాపి. చివరి నిమిషంలో 'నారాయణా' అనే పేరుగల తన కొడుకును పిలిచాడు. వెంటనే అతనికి ముక్తి లభించింది. అన్నమయ్య నామ ప్రాధాన్యం తెల్పుతూ ఉదాహరించిన ఈ కథ ద్వారా అధునిక యుగ జీవులమైన మనం తెలుసుకోవలసింది ఏమిటంటే - మన సంతానానికి - పాశ్చాత్య పోకడలుగల 'నిశాంత్, ఖరేష్' మొదలైన పేర్లు పెట్టకుండ దేవుని పేర్లు పెట్టాలని గ్రహించాలి.

స్వామి నామోపాసనలో తరిస్తూ, స్వామి పరిపూర్ణ తత్త్వాన్ని తెలుసుకొనే ఉత్తమ అధ్యాత్మిక జాతి వారసులుగా మారటానికి ప్రయత్నిస్తేనే - ఈ అన్నమయ్య గీతం చదివిన ఫలితం సిద్ధిస్తుంది.

## 24. శరణమాతనికే సర్వ భావాల

శరణమాతనికే సర్వ భావాల
యిరవై మమ్ము రక్షించ నీశ్వరుడే యెరుగు

1. వచ్చిన త్రోవెరగము వడి బూర్వ కాలమందు
చొచ్చెటి త్రోవెరగము సోదించి మీద
కుచ్చిన కర్మములతో గుదియై వేలుకాడేము
హెచ్చి మా బ్రదుకు దోవ యీశ్వరుడే యెరుగు

2. నన్ను నేనే యెరగను నానా చందములను
అన్నిటా నాలోనున్న హరిగానను
కన్నుల జూచుచు మంచి కాయములో నున్నవాడ
యెన్నగ నా జ్ఞానము యీశ్వరుడే యెరుగు

3. మొదలు దెలియను ముంచి కొన దెలియను
చదువుచునున్నవాడ సర్వ వేదాలు
హృదయములోనుండి యిటు నన్ను గావగ
యిదివో శ్రీవేంకటాద్రి యీశ్వరుడే యెరుగు

(తా.ప.సా. 04-34)

**భగవద్గీతా శ్లోకం**

సర్వ ధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో
మోక్షయిష్యామి మాశుచః

(గీ. 18-66)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

కర్మ యోగ, జ్ఞానయోగ, భక్తి యోగ రూపాలైన సమస్త ధర్మాలునున్ను, ఇప్పుడు చెప్పినట్టు అనుష్ఠింపుచున్న అందుల ఫలమునున్ను, తాగర్తననే కర్తృత్వమున్ను విడిచి, సకల కర్తనైన నన్నే శరణు చొరుము. యీరీతి నుండితివా, నన్ను బొందేందుకు విరోధులైన సమస్త పాపాల వల్లనున్ను నిన్ను ముక్తుని జేశేను. వగవకుము.

(పుట-333)

***భావ విశేషాలు :***

అన్ని భావాలతో అతనికి (=శ్రీహరికి) శరణం పలుకుతున్నాను. మా హృదయం నివాసం (=ఇరవు) చేసుకొని మమ్మలిని రక్షించే విషయం ఆ ప్రభువైన శ్రీవేంకటేశ్వరునికే తెలుసు.

1. ఈ జీవులమైన మాకు అనేక జన్మలనుంచి వస్తున్న ఈ దారి తెలియదు. భూత కాలానికి సంబంధించిన ఈ జన్మల వడి మాకు తెలియదు. (రాట్నానికి చుట్టి కదురునకు తగిలించే వడి దారాన్ని వడి అంటారు.) రాబోయే జన్మలలో ఏమవుతామో, ఏ ఏ రకాల జన్మలలో ప్రవేశిస్తామో వెతికే (=సోదించి) శక్తి - గ్రహించే శక్తి - మాకు లేదు. మా కర్మలన్నీ - పూలు మొదలగువాని గుత్తిలా - ఒకదానితో ఒకటి కూర్చబడినవి. (=కుచ్చిన). కర్మల గుత్తిలా (=గుదియై) మారి వేలాడుతున్నాం. ఈ కర్మల గుత్తి ఇలా పెరిగి పెరిగి - మా బతుకు తోవ ఏమవుతుందో ఆ ప్రభువైన ఈశ్వరునికే తెలుసు.

2. అనేక రకాలుగా (=చందములను) జన్మలెత్తిన నాగురించి నాకే అవగాహనలేదు. అందరిలోను, నాలోను ఉన్న శ్రీహరిని నేను చూడలేకపోతున్నాను. మంచి శరీర దృఢత్వంతో ఉన్నాను. నా కళ్లు నా లోపల ఉన్న 'హరిని చూడలేకపోతున్నాయి కాని, బయట కనిపించే ప్రతి ఆకర్షణని మైమరుపుతో చూస్తున్నాయి. ఇది జ్ఞానమో! అజ్ఞానమో! - శ్రీహరికే తెలుసు. (భౌతిక ఆకర్షణలకి లొంగటం అజ్ఞానమని భావన.)

3. అన్ని వేదాలు చదువుతున్నాను కాని, మొదలు తెలియదు. నశించే (=ముంచు) తుది తెలియదు. (అంటే సృష్టి, ప్రళయాల గురించి సమగ్రమయిన అవగాహన రావటం లేదని భావం).

నా హృదయంలో ఉండి ఈ విధంగా ఉన్న నన్ను రక్షించే పద్ధతి - ఇదిగో - నా ఎదురుగా ఉన్న - ఈశ్వరుడైన శ్రీవేంకటేశ్వరునికే తెలుసు.

'సర్వ ధర్మాన్ పరిత్యజ్య ..' అను గీతా శ్లోకాన్ని చరమ శ్లోకం అంటారు. ప్రతిరోజూ ఆరాధనలో ఈ చరమ శ్లోకంతో పాటు - శ్రీరామ చరమ శ్లోకం (సకృదేవ..) సీతా చరమ శ్లోకం (పాపానాం..) శ్రీవరాహ చరమ శ్లోకం (స్థితే మనసి...) శ్రీనారసింహ చరమ శ్లోకం (సత్యం బ్రవీమి...) శ్రీరంగ చరమ శ్లోకం (మామేవా...) శ్రీసుదర్శన చరమ శ్లోకం (సుదర్శన..) శ్రీపాంచజన్య చరమ శ్లోకం (పాంచజన్య...) కలిపి కొంతమంది భక్తులు చదువుకొంటుంటారు. వీటి వరుసలో కలిపి చదువుకొనదగిన ఉత్తమోత్తమమైన కీర్తన 'శరణ మాతనికే' అనునది.

సర్వ ధర్మాన్ శ్లోకంలో ఉన్న ధర్మములనే పదానికి కర్తవ్య కర్మలు అని పెద్దలు అర్థం చెప్పారు. దీనినే అన్నమయ్య మొదటి చరణంలో వివరించాడు. మా కర్మలన్నీ - పూలు మొదలగువాని గుత్తిలా - ఒకదానితో ఒకటి కూర్చబడినవి. వీటి సంగతి దేవునికే తెలుసు. అతనికి శరణం అన్నాడు అన్నమయ్య. అంటే - అన్నిటా - ఆయనని తలచుకొంటూ - కర్మాచరణ చేస్తే - ఫలితాన్ని స్వామికే అర్పిస్తే - మనకు కర్మఫలమంటదని కవి భావం.

అనంతాళ్వార్ వైష్ణవ లక్షణాలను ఇలా చెప్పారు. 'శ్రీవైష్ణవుడు కోడివలె, కొంగవలె, ఉప్పువలె నడచుకోవాలి. కోడి చెత్త కుప్పలను కాళ్లతో చిమ్మివేసి, సారమైన వాటినే ఆహారంగా గ్రహిస్తుంది. అలాగే వైష్ణవుడు అసార విషయాలను వదిలి సారమైన శరణాగతిని అలవరుచుకోవాలి. కొంగ సరస్సులో ఎన్ని చేపలు ఉన్నా తన నోటికి సరిపోయేటన్ని చేపలను మాత్రమే గ్రహిస్తుంది. ఇట్లాగే వైష్ణవుడు ఎన్నెన్నో ధర్మాలు లోకంలో ఉన్నా, తన వైష్ణవ ధర్మానికి సరిపోయేవి మాత్రమే గ్రహించాలి. ఉప్పు రాయి బయటా, లోపలా ఒకే విధమైన రసాన్ని కలిగి ఉంటుంది. ఆలాగే వైష్ణవుడు బయటా, లోపలా భగవంతుని సంబంధాన్ని, తదనుగుణమైన ఆనందాన్ని అనుభవిస్తూ ఉండాలి. అనంతాళ్వారు చెప్పిన మూడో లక్షణాన్ని అన్నమయ్య రెండో చరణంలో కాస్త కవితాత్మకంగా చెప్పాడు. లోపల, బయటా స్వామిని చూడకుండ ఉన్నాను. ఆ రసానుభూతి కలిగించే బాధ్యత స్వామిదే. అందుకోసం నేను ఆయనను శరణు కోరుతున్నానన్నాడు కవి.

'నెమలి తన ప్రియురాలి సంతోషం కోసం అనేక రంగులు కల తన పింఛాన్ని విప్పి నాట్యం చేస్తుంది. ఆట అయిపోయిన తర్వాత పింఛాన్ని తనలోపలికి లాక్కుంటుంది. శ్రీహరి నెమలి. ఆయన పింఛం ఆయన శరీరమే అయిన ప్రపంచం. పింఛం పురి విప్పటం సృష్టి. లోపలికి లాక్కోవటం ప్రళయం' అని పరాశర భట్టరువారు తమ రంగరాజ స్తవంలో చెప్పారు. ఈ సృష్టి, ప్రళయం - వేదాలు చదువుతున్నా నాకు అర్థం కావటం లేదనే - కవి వాక్కులో శరణు కోరితే సర్వం నీకు అవగాహన అవుతుందనే ఉపదేశం ఉంది.

వైష్ణవుల ఉత్తమోత్తమమయిన లక్షణం వినయం. మహాత్మునికి ఎంతో ఇష్టమయినఅన్ని భావాలతో అతనికి (=శ్రీహరికి) శరణం పలుకుతున్నాను. మా హృదయం నివాసం (=ఇరవు) చేసుకొని మమ్మలిని రక్షించే విషయం ఆ ప్రభువైన శ్రీవేంకటేశ్వరునికే తెలుసు.

శరణం-వినయానికి పర్యాయ పదం. గీతాచార్యుడు, అన్నమాచార్యుడు చెప్పిన శరణభావాన్ని అలవరుచుకొని, జీవితానికి ఒక అర్థం-పరమార్థం కల్పించుకొందాం.

## 25. సమబుద్ధే యిందరికి

సమబుద్ధే యిందరికి సర్వ వేద సారము
ఘనుడిందరికి హరి సాధనమోయయ్యా

1. చీమకు దన జన్మము చేరి సుఖమై తోచు
దోమకు దన జన్మము దొడ్డ సుఖము
ఆమని యీగకు సుఖమాజన్మమై తోచు
యేమిటా నెక్కువ సుఖమెవ్వరి కేదయ్యా

2. జంతురాసులకునెల్లా జననములొక్కటే
అంతటాను మరణములవి యొక్కటే
చెంత నాహార నిద్రలు స్త్రీ సుఖాలొక్కటే
ఇంతటానిందుకంటే నెవ్వరేమిగట్టిరయ్యా

3. ఇందులో నెవ్వరైనా నేమి శ్రీ వేంకటపతి
నందముగాదలచినదది సుఖము
యెందు జూచినానీతడిందరిలో నంతరాత్మ
చందముగా నెవ్వరికి స్వతంత్ర మేదయ్యా

(తా.ప.సా.02-409)

**భగవద్గీతా శ్లోకం**

సమం పశ్యన్ హి సర్వత్ర
సమవస్థితమీశ్వరమ్
నహినస్త్యాత్మనాత్మానం
తతో యాతి పరాం గతిమ్

(గీ. 13-28)

**పెదతిరుమలయ్య వ్రాసిన శ్లోక భావం**

ఈ రీతినె సర్వమైన దేహాలందున్నూ సరిగా వుండే ఆత్మ, తమ దేహాదులయందు స్వామియై వుండిన్నీ దేహాదులు చెడేటప్పుడు ఆత్మ చెడదు. యిటని యెవ్వడెరుగును. వాడు ఆత్మ నెరుగును.

(పుట-333)

***భావ విశేషాలు :***

సమబుద్ధిపై అన్నమయ్య చెప్పిన భాష్యం ఈ గీతం. ఇంతమంది తెలుసుకోవలిసినది, అన్ని వేదాలలో చెప్పిన సారం - ఒక్కటే. అది అందరిని సమానంగా చూడాలనే సమబుద్ధి. ఇంతమందిని శ్రీహరి సమానంగా చూస్తాడు. అతడే ఇంతమందికి సమబుద్ధి పొందుటకు సాధనం. (ఇంతమంది ఎవరో రాబోయే చరణాలలో వివరిస్తున్నాడు.)

1. చీమకి తన జన్మలో చేరిన తర్వాత - అది ఎంతో సుఖమనిపిస్తుంది. దోమకి తన జన్మ పెద్ద (=దొడ్డ) సుఖంలా అనిపిస్తుంది. తేనెటీగకు (=ఆమని యీగ) సుఖం - తన పుట్టుకనుండి (=ఆజన్మమై) ఉన్నదనిపిస్తుంది. ఇందులో ఎవరికి ఎక్కువ సుఖముంది? అని చెప్పటానికి వీలుకాదు. అందరికి సుఖం సమానమే. ఒకరికి ఎక్కువ, ఒకరికి తక్కువ లేదు.

2. జంతు సమూహాలన్నింటికి పుట్టుకలన్నీ ఒకే పద్ధతిలో జరుగుతాయి. అన్నింటికి మరణాలు ఒకే పద్ధతిలో జరుగుతాయి. ఆహారనిద్రలు, స్త్రీ సుఖాలు దగ్గర - దగ్గరగా (=చెంత) ఒక్కటే. ఆహారనిద్రలు, కామ సుఖాలకు మించి - ఇంతకంటె ఇతరాలు ఏమి మూట కట్టారు? (అనగా ఆహారనిద్రలు, కామ సుఖాలు అందరికీ ఎప్పుడూ సమానమే అని భావం)

3. ఈ సకల జీవ రాశిలో ఎవ్వరైన, శ్రీవేంకటేశ్వరుడిని అందంగా తలచుకొంటే చాలు - అది సుఖాన్ని ఇస్తుంది. ఎక్కడ చూసినా ఈ వేంకటేశ్వరుడు, అందరిలో అంతరాత్మగా కనిపిస్తాడు. న్యాయంగా (=చందముగా) ఈ జీవులలోఎవరికీ స్వాతంత్ర్యం లేదు. (అందరూ కర్మ బద్ధులే అని భావం)

మోక్షం కావాలనుకొనే భక్తుడు అన్నిటియందు సమబుద్ధి కలిగి ఉండాలి. (12-04) జ్ఞాని అన్ని విషయాలలోను సమభావంతో ఉండాలి. (13-09) జ్ఞాని సమదర్శిగా ఉంటాడు. (05-18) నేను సమస్త ప్రాణులందును సమంగా ఉన్నాను. (12-29) పరమాత్మ శ్రీహరి అన్ని ప్రాణులలోను సమానంగా ఉన్నాడు. (13-27) అన్ని చోట్ల సమానంగా ఉన్నాడని తెలుసుకొన్నవాడు మోక్షాన్ని పొందుతాడు (13-28) - ఇలా భగవద్గీతలో ఉన్న సమబుద్ధి శ్లోకాల సమాహారంగా అన్నమయ్య - మన ఎగుడు దిగుడు బుద్ధిని సరిసమానం చేసే ఈ సమబుద్ధే గీతాన్ని రచించాడు.

ఈ సృష్టిలో అందరూ ఎలా సమానం? అనే ప్రశ్నకు సమాధానంగా మొదటి చరణంలో సమాన సుఖాన్ని వివరించాడు. ఇంద్రియాలన్నింటిలోను వ్యాపించి తృప్తిని కలుగచేసేది సుఖం. ఇది చీమకు, దోమకి, తేనెటీగకి, మనిషికి - అందరికి సమానమే. ఒకరికి ఎక్కువ కాదు. ఒకరికి తక్కువ కాదని అన్నమయ్య భావం.

'చీమకి తన జన్మ సుఖాన్ని ఇస్తుంది' అంటున్నాడు కవి. బ్రహ్మ సూత్రాల వ్యాఖ్యానంలో చీమల మార్గాన్ని యోగ మార్గంతో పోల్చారు. నెమ్మది నెమ్మదిగా నడుస్తూ చీమ తన లక్ష్యాన్ని చేరుకొంటుంది. యోగి కూడ ఇలాగేనెమ్మది నెమ్మదిగా తన గమ్యాన్ని పొందుతాడని - చీమల మార్గానికి అంత గొప్ప విలువనిచ్చారు. అందుకే సృష్టిలో ఏ ఒక్కటి తక్కువ కాదు. ఎక్కువ కాదు. అన్ని సమానమే అని చెప్పటానికి మహాకవి చీమల జన్మ పోలికతో చరణాన్ని ప్రారంభించాడు.

ఆమని ఈగ అను అన్నమయ్య ప్రయోగం 'మధు మక్షిక' అను పదానికి తెలుగు అనువాదంలా అనిపిస్తోంది. ఆమనికి పర్యాయ పదం మధువు. (జి.ఎన్. రెడ్డి తెలుగు పర్యాయపద నిఘంటువు. పు.157) కనుక ఆమని ఈగకు - తేనెటీగ అని అర్థం చెప్పుకోవచ్చు.

'ఆహార నిద్రాభయ మైథునం చ / సమానమేతత్ పశుభిర్నరాణామ్ / ధర్మో హి తేషామధికో విశేషో / ధర్మేణ హీనాః పశుభిస్సమానాః' (ఆహారం, నిద్ర, భయం, సంభోగం - ఈ నాలుగు లక్షణాలు పశువుకి, మానవులకి అందరికీ సమానమే. కాక పోతే ఉత్తమమైన ధర్మ ప్రవర్తన ఒక్కటే - పశువులనుంచి మానవుడిని వేరు చేస్తోంది, ధర్మ బుద్ధి లేకపోతే ఆ మానవులుపశువులతో సమానం..) ధర్మానికి బదులు వివేకాన్ని అధిక విశేషంగా పేర్కొంటూ కొద్ది మార్పులతో ఇదే శ్లోకం ఉత్తర గీతలో కూడ ఉంది. అన్నమయ్య సర్వ సామాన్యమైన ఆహారాదులతో పాటు జనన మరణాలను కూడ కలుపుతూ రెండవ చరణం వ్రాసాడు.

'స్వామినిఅందంగా తలుచుకోవాలి' అను కవి ఉపదేశంలో 'అందంతో ఆనందం కలిసి ఉంటుంది'. అందుకే సమదృష్టితో, స్వామిని అందంగా నీ మనస్సులో నిల్పుకొంటూ ప్రార్థించు. ఆనందనిలయంలో ఉన్న ఆ మూర్తి నీకు అనిర్వచనీయమైన ఆనందాన్ని ప్రసాదిస్తాడు' అను భావం ఉంది.

స్వతంత్రం ఎవరికీ లేదన్నాడు కవి. అంటే జీవులు అస్వతంత్రులు కనుక అంతరాత్మగా వెలుగొందు తున్న ఆ స్వామిని శరణు వేడుకొంటే - ఆ సముడు - శ్రీవేంకటేశుడు సమదృష్టిని మనకు కలిగించి ఉత్తమ గతిని ప్రసాదిస్తాడని అన్నమాచార్యుని ప్రబోధం. దీనిని తలదాల్చి త్రికరణ శుద్ధిగా స్వామిని శరణు వేడి సుజన రంజనులమై, జన్మ చరితార్థం చేసుకొనెదము గాక.

మంగళం మహత్.... ఓమ్ తత్ సత్.

స్వస్తి.